# సనాతన సారథి

ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక అధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 ఆగష్టు 1980 సంచిక 8

చిత్రము : — కరుణా పూరిత వీక్షణం



చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు ../-9-"80 అనియుండిన, మీ చందా సెప్టెంబర్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు 6 రూ ॥) ఆగష్టు నెల 31 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

-: శ్రీ వారి కార్యక్రమములు

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారు అవి తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 20

ఆత్మవిచారమునకు ఆశ్రమధర్మము లెంతయో అవస్యకము. ఆశ్రమధర్మజ్ఞానము స్వార్జితము. బాల్యావస్థ అనంతరమువరకూ మనుజుడు ఆశ్రమవాసి కానేరడు. అంతవరకూ వానికి ప్రాప్తించు జ్ఞానవిశేషము లేవియూ లేవు.

జీవశరీరమునకు బాల్య, కౌమార, యవ్వన వార్ధక్యావస్థలున్నటుల, జ్ఞానమునకుకూడాను నాలుగు అవస్థలు కలవు. అందు మొదటిదగు బాల్యావస్థయందు జీవితము అజ్ఞానదశయందుండి శిష్యత్వమునంగీకరించి, దాశ్యమునకు, శిక్షణకునులోనై యెట్టి బాధ్యతలునులేక జ్ఞానార్జన జేయుచుండవలెను. రెండవదశయగు యవ్వనమున సంఘనిర్వహణ బాధ్యతను వహించి ధనార్జనమందును దాని వినియోగమునందును జాగరూకత కలిగి, తనకంటే చిన్నలకు తగిన శిక్షణనొసంగు ఆదర్శములను అందించుచు, పెద్దలను అనుసరించుచూ, జ్ఞానాభివృద్ధిని గడించుచుండవలెను. మూడవదశయగు కౌమారమునందు కేవలము స్వీయసంఘు, కుటుంబమే కాక ప్రజాసౌఖ్యనిర్వహణాభారము సైతము వహించి లోకశ్రేయమునకు తన సౌఖ్యమునైనా లక్ష్యపెట్టక, పాటు పడుచూ అంతర్జ్ఞానమును సంపాదించు చుండవలెను. నాల్గవదియగు, వార్ధక్యమునందు తనకు పూర్వము కలిగిన అనుభవమూలమున ఇహలోక సుఖాదులు నిస్సారములనియు, అనిత్యములనియు గ్రహించి విజ్ఞానవంతుడై, దయాపరుడై, సర్వభూతహితుడై తనయనుభవజ్ఞానమును లోకమునకు చాటవలెను. ఇట్లు జీవుల గుణములను, వృత్తులను నాలుగు తరగతులుగా గనుపించుచున్నవి.

తెలివిని పెంచుటకు చదువువలే జ్ఞానమును పెంచుకొనుటకు ప్రవర్తన ముఖ్యము. బాల్యావస్థయందు విద్యతోపాటు, వినయ, విధేయత, భక్తి, శ్రద్ధ, పరిశ్రమము నుండవలెను. యవ్వనావస్థయందు ధనార్జనమేకాక, సంఘనిర్వహణమే కాక, సదాచార, శీలసంపన్నతను, ధార్మిక ఆధ్యాత్మికభావములను, చిత్తమును తీర్చిదిద్దుకోవలెను. కౌమారమున, కేవల సంఘ, కుటుంబ పోషణతో పాటు, నీతి, నిజాయితీలను, పెంపొందించుకొని తన బిడ్డలకు ఆదర్శవంతమైన జీవితాన్ని అందించి సమాజమున అట్టి, సదాచారమును నిరూపించవలెను. సంఘమును ధిక్కరించి స్వకుటుంబ పోషణనుమాత్రమే లక్ష్యమందుంచుకోరాదు.

పుట్టువుకానీ, సంస్కారముకాని వేదాధ్యయనముకాని బ్రహ్మతత్త్వమునకు కారణముకాదు, వర్తనమే మూలకారణము. పుట్టిన వాడు యెప్పుడో ఒకప్పుడు మృతినొందక తప్పదు. లోకమున ప్రతినిమిషము యెందరో పుట్టుచున్నారు, యెందరో గిట్టుచున్నారు. అయితే మృత్యువు లేకుండ చేసుకొనుటెట్లు? అని విచారించవచ్చు. ఆత్మ యెన్నడును పుట్టదు. పుట్టని ఆత్మకు మృత్యువు లేదు. ఇక్కడ కామముతో జేరిన, కూడిన దేహమునకే మృత్యువు. యోగమే మృత్యువు. భ్రమచెందుటయే మృత్యువు. (భ్రమలేకుండుటే అమృతత్త్వము). మృతి బొందునది దేహమేకాని, ఆత్మ కాదు. దేహమెప్పుడునూ మారుచునేయుండును. మార్పుచెందునది, నశించకతప్పదు. నాశముగల దేహమునే నేనని, భ్రమపడి, జ్ఞానహీనుడై మృతి నొందుట మానవ హీనము.

జీవుడు కర్మానుష్ఠానముచే జ్ఞానమును వృద్ధి చేసుకొనిన కొలదీ శరీరములు మారిపోయి ఉన్నత పరిణామము నందుకొనుచుండును. పచ్చిచింత కాయలోని బెరడు, గుజ్జు, ఈనెలు, గింజలు వేరుచేయ సులభసాధ్యము కాదు. అటులనే విషయాసక్తులకు దేహాభిమానులకు జ్ఞానము వంటదు. పండిన చింతకాయలోని బెరడు మొదలగునవన్నియునూ లోనున్న పండుతోనే విడిపోవునట్లు దేహాభిమానమాత్మను వదలి పోవును. అపుడు ఆత్మ స్వచ్ఛముగా కనుపించును.

అన్నమయ, ప్రాణమయ కోశములు రెండును స్థూలశరీరము. ఈరెండు కోశములు దూరము కాగానే, దేహము క్రిందపడును. ఇక సూక్ష్మ దేహము: సూక్ష్మమనగా చిన్నది అని మామూలు అర్థము. ఇక్కడ సూక్ష్మమన వ్యాపించునది అని అర్థము. జలముకంటే వాయువు సూక్ష్మము. వాయువుకంటే ఆకాశమగు శబ్దము సూక్ష్మము. మంచుగడ్డ స్థూలమైనది, దానిలోని నీరు, నీరు కంటే ఆవిరి సూక్ష్మమైనది. మంచుగడ్డ, కర్పూరము స్థూలముగా కనుపించిననూ దాని ఆవిరి సూక్ష్మమై అవ్యక్తమై యుండును. వ్యక్తము నుండి అవ్యక్తము ఏర్పడిన దాని లోకధర్మము. ఆధ్యాత్మిక ధర్మమిట్టిది కాదు అవ్యక్తమగు ఆత్మనుండే వ్యక్తమగు పదార్థమేర్పడినది. కడకు అవ్యక్తములో లీనమగుచున్నది.

గోవులనుండి పాలు వచ్చునట్లు పరమ పురుషుడగు ధేనువునుండి మాయాశక్తియగు పంచభూతాత్మకమగు ప్రకృతియను పాలు బుట్టుచున్నవి. పాలు గాచుటచేత మీగడ కలిగినట్లు,

ఆ పాలయందు చల్లను గలుపుటచే మీగడ పాలు, వేడిమి, చల్ల కలిసి పెరుగగును: నూతనమగు పదార్థము, ఆ పెరుగును చిలికిన, వెన్న బయలు దేరును.

ప్రకృతియను పాలయందు పంచమహాభూతములొండొంటితో కలిసి బహువిధపరిణామములు తుదకు భూగోళమను వెన్నముద్దగ ప్రత్యక్షమగుచున్నది. ఆ గుణములలోనేగుణమధికమైన ఆ గుణస్వభావము వస్తువునందు గనబడునటుల పంచభూతములలో యేభూతమధికమైన ఆ భూత స్వభావమే సహజమని ముఖ్యముగా గోచరించుచుండును. చరాచరప్రపంచమునందంతయును పృధ్వీతత్త్వమధికమై యుండుటచేత ఇది జీవితమనబడుచున్నది. అటులనే జలతత్త్వము, తేజ తస్తత్త్వము అధికమగుచున్న భువర్లోకమని, సువర్లోకము అనబడు చున్నది. అందలి పదార్థములు ఆయా తత్త్వములు కలిగియుండును

ప్రపంచమంతయు ఈశ్వర జీవ భూతములనెడి మూడు తత్త్వముల పరిణామము. మాయ అవిద్యతమములయందు ప్రతిఫలించెననునపుడు ముఖ్యముగా గమనింపదగిన అంశము ఒకటి కలదు. అద్ద మొక ఉపాధి; దీని శక్తి యెదుట వస్తువులను ప్రతిఫలింప జేసుకొనుట, కానీ అద్దములయొక్క మలిన వక్రమాదులతో అందలి ప్రతిబింబములకు వాస్తవముగ యెట్టి సంబంధమునూ లేదు. కానీ అద్దమునందలి మలిన వక్రాదులను మనమే ప్రతిబింబములకు ఆపాదింపబడుచున్నది.

అటులనే బ్రహ్మమునకు మాయాసంబంధము లేకపోయినను అభ్యాసమున్నట్లు భావింపబడుచున్నది. పరమాత్మ ప్రతిబింబముతోకూడి, మాయయే, పాలు పెరుగుగా పరిణమించినట్లు, జగద్రూపముతో పరిణ మించినది. ఇది మాయయే కానీ ప్రతిబింబము కొలది కాదు. మాయ తన్నాశ్రయించినది కాన, మాయ తన స్వాధీనము అయినందున మాయకు ప్రభువు తానే. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వశక్తివంతుడు. జీవేశ్వర భూతములను మూడు తత్త్వములలో జీవుని భోగార్థమై ఈశ్వర సృష్టి యేర్పడినది. ఈశ్వరుడు ఆప్తకాముడు. సృష్టియందలి సర్వభోగములూ తననుండి యేర్పడినవి. అతడు కోరునది యెద్దియునూ వుండదు.

నమే పార్థాస్తి కర్తవ్యం, త్రిషులోకేషు కించన సర్వజీవరాశులచైతన్యము నిమిత్తమే తాను కర్మ సృష్టించుచున్నాడు. తాను కర్మఫలప్రదాత కర్మలు ఫలమునొసంగజాలవు. ఈకర్మకు ఈ ఫలము, అని జడమగు కర్మ నియోగించుకొన జాలదు.

(సశేషము)



# ధ్యాన విధానం

సాధనలో ఈమధ్య నాకు కలిగిన అనుభవాన్నొక దానిని భక్త మిత్రులతో పంచుకోవాలనే ఉద్దేశ్యంతో ఈ వ్యాసం వ్రాస్తున్నాను. చాలామంది నా దగ్గర ధ్యానం ద్వారా తమ తమ సమస్యలకు పరిష్కార మార్గం తెలుసుకొంటుంటారు. ధ్యానం చేస్తున్నసమయంలో నాదగ్గరకు వచ్చిన వ్యక్తుల సమస్యలకు పరిష్కార మార్గం చూపమని బాబావారిని వేడుకొంటుంటాను, నాకు కలిగిన ఈ నూతన అనుభవం మూడు సార్లు వేర్వేరుగా ఆరీతిగా పరిష్కారం కోసం వేడుకొంటున్న సమయాల్లో కల్గింది.

మొట్టమొదటి సారి ఎస్టెల్ పెప్పర్ అనే భక్తురాలి ప్రశ్నకు సమాధానంగా ఆ అనుభవం కల్గింది. పెప్పర్ తన దినచర్యలో భాగంగా అనేక మంది విషయవాంఛాపూరిత వ్యక్తులతోనూ, వ్యతిరేక భావాలు గలవారితోను, అట్లాంటి వాతావరణంలోనూ పని చేయడంవల్ల కలిగే సమస్యలగురించి బాబావారికి మనవి చేయమని నన్ను కోరింది. ఆ సమయాల్లో ఆ వ్యక్తులతో ఎట్లా మెలగాలో తెలపమని బాబావారిని ప్రార్థిస్తూ ధ్యానంలో కూర్చున్నాము. ఆ సమయంలో నా మానసిక నేత్రంపై స్వామి చిత్రం ఒక్కటి వచ్చి నిలచింది. ఆ చిత్రం హృదయంమీద పరచిన తెర మీద పడిన సినిమాలాగా తోచింది. స్వామి చిరునవ్వు చిందిస్తూ నన్ను తన చూపుడు వేలుతో అనేక మంది వ్యక్తుల హృదయాలవైపు చూడమన్నట్లు సూచించారు. ఆ వ్యక్తులహృదయాలు గాజుతో చేసిన వాటి మాదిరిగావున్న దేహంలోంచి స్పష్టంగా కనబడసాగాయి. ప్రతివ్యక్తి హృదయంలోనూ బంగారు వర్ణం కలిగిన నిప్పుకణికలు కనబడ్డాయి. స్వామి మాతో "వ్యక్తి మంచివాడైనా చెడ్డవాడైనా. ప్రతి హృదయంలోనూ, ఆ కణికలు గనుల్లోనూ, నిధుల్లోనూ దాచబడిన బంగారు మాదిరిగా దాచబడి వుంటాయ"ని చెప్పారు. మమ్మల్ని ఆ నిధిపై దృష్టి కేంద్రీకరించమని చెబుతూ, అట్లా హృదయంలో దాచబడిన నిధిని, వ్యక్తిత్వమనే బయటముసుగుకు గుర్తింపు నివ్వడం మానివేస్తే, గుర్తించడానికి అవకాశం వుంటుందని తెలిపారు, ప్రతివ్యక్తిలోనూ స్వామి చూపిన హృదయకేంద్రం స్పష్టంగా కనబడింది, వారు తెలిపిన సాధనా విధానం కూడా చాలా సులువైనది.

కొద్ది వారాలపాటు స్వామి చెప్పిన పద్ధతిలో ఎస్టెల్ పెప్పర్తో కలసి సాధన చేశాను, ఆమె ఈ తడవ తన కొచ్చిన మరొక కష్టాన్ని గురించి చెప్పింది. తన దిన చర్యలో స్వామి సాన్నిహిత్యాన్ని, బోధలనూ గుర్తుంచుకోవడం కష్టంగా వుందనీ, తను పని చేసే ప్రదేశంలో వచ్చేపోయే జనం, ప్రాపంచిక విషయాలు తన శక్తిని క్షీణింప చేయటమేకాక, స్వామి మీద తన దృష్టిని నిలపకుండా చేస్తున్నాయని ఆమె తెలియ చేసింది.

తిరిగి స్వామిని ఆమెను ఆ కష్టంనుంచి దూరం చేయమని ప్రార్థించాము. ఈ తూరి మేమిద్దరమూ ఒక్కసారిగా వైట్ఫీల్డులోని బృందావనంలో స్వామి దర్శనంకోసం బారులు తీరి కూర్చొన్న అను

భూతిని పొందాను. ముందుగావరుసల్లో ఎస్టైల్ పెప్పర్. ఆమె వెనుకగా నేను కూర్చొన్నట్లు తోచింది. అదే సమయంలో స్వామి బంగళాగేటు తెరచుకొని భక్తులకు దర్శన మివ్వటానికి వచ్చారు. వచ్చీ రావటంతోనే ఎస్టైల్ ముందుకు వచ్చి మాట్లాడటం మొదలు పెట్టారు. స్వామి చాలా వేగంగా మాట్లాడు తున్నప్పటికీ, ఆమె వెనుకనే కూర్చొన్న నేను అర్థం చేసుకోగల్గుతున్నాను. అంతేకాక ఎస్టైల్‌కు వివరించసాగాను. ''ఆధ్యాత్మిక జిజ్ఞాస కల్గిన వారు గానీ నా వద్దకు వచ్చినవారిలోగాని మీకు వారి హృద యంలో చూపిన నిప్పుకణికలు వాటి మీది నివురు తొలగి బంగారు రంగులో మెరవ నారంభిస్తాయి. అయితే ఆ నిప్పుమీద తిరిగి నివురు ఆవరించకుండగా, కమ్మరి కొలిమిని ఎట్లా గాలితిత్తితో రాజేస్తాడో ఆ రీతిగా, మన ఉచ్ఛ్వాస, నిశ్వాసాలనే గాలితిత్తితో రాజేస్తూవుండాలి. మనం పీల్చి వదిలేగాలి హృద యంలోని నిప్పుమీద నివురు ఆవహించకుండా చేస్తుం దని'' తెలిపారు. దానిలో అంతర్లీనమయిన సాధనా విధానాన్ని వివరిస్తూ ''మొదట మామూలుగా శ్వాస పీల్చి మీ ఊపిరితిత్తులను నిండనీయండి. సహజ రీతిలో ఆ రకంగా ఊపిరితిత్తుల్లో గాలి నింపిన పక్షంలో బయట పీడనశక్తి, శరీరంలోని పీడన శక్తి సమాన మవుతాయి. అపుడు మెల్లగా మెల్లగా గాలిని వదలాలి. ఆ వదుల్తున్న గాలి హృదయంలో వున్న నిప్పుకణికదిశగా పోయేట్లు చేయాలి. అపుడు ఆ కణిక మెరుస్తుంది'' అంటూ స్వామి, గాలిని హృదయం మీదికి ఎట్లా వదలాలో తలను వంచి చేసి చూపించినారు. అంతేకాక ''ఈ అభ్యాసం మీరు ఎప్పుడైనా, ఎక్కడయినా చేయవచ్చు. కారులో గానీ, విమానంలోగానీ, ఇంట్లోగానీ, ఆఫీసులోగానీ, ఒంటరిగాగానీ, జనసమూహంలోగానీ, చేయవచ్చు. ఈ అభ్యాసం చేయడానికి వీలు కావడం లేదనీ సాకు చెప్పే ప్రశ్నే లేదు. దానిని మరచిపోయే అవకాశం కూడా లేదం''టూ తను చిలిపిగా నవ్వుతూ'' ఎవరూ ఊపిరి పీల్చడం మరువ జాలరు. ఈ అభ్యాసం కోసం ఏ పనిముట్లూ అవసరం లేదు. అయితే ఒక వ్యక్తికోసం, మరొకరు మాత్రం ఈ సాధన నలప జాలరు" అని తిర్గి చిలిపిగా నవ్వి ''నేను కూడా మన కోసం మనం ఈ అభ్యాసం చేసే బాధ్యత స్వీకరిం చాలి. ఇది ఏమంతక్లిష్టమయినది కాదు. మొదలు పెట్టిన కొద్దిరోజుల్లోనే మీరు దీనికి అలవాటు పడి పోతారు. క్రమేణా మన ధ్యాస లేకుండగనే అది కొనసాగిపోతుంది. మీకు దీనిద్వారా ఎక్కువశక్తి వస్తుంది. మీలో ఈ ఆత్మశక్తిద్వారా ప్రతి పనీ సులువుగా తోస్తుంది. ఈ చిన్న అభ్యాసం మరచి పోకుండా చేయగల్గితే క్రమేణా చాలా మంచి ఫలితా లను ఇస్తుంది. మీలోని అంధకారాన్ని పారద్రోలి విజ్ఞానప్రకాశాన్ని పెంపొందిస్తుంది. తక్కువ కాంతి నిచ్చే క్రొవ్వొత్తినుండి ఎక్కువ కాంతినిచ్చే హెచ్చు శక్తిగల కరెంటు బల్బుమాదిరి మారగల్గుతారు'' అంటూ వివరించారు.

స్వామి తమ ఉపదేశాన్ని కొనసాగిస్తూ "మీరు నేనిచ్చిన ఈ ఉపదేశాన్ని మరువకుండా సాధనలో పెడితే నా సర్వవ్యాపకత్వాన్ని మీకు ఋజువు చేస్తా నని వాగ్దానం చేస్తున్నాను. అంతేకాక మీరు నన్ను మీలో అనుభవించగల్గి ఈ అభ్యాసం కొనసాగించాలి. కాబట్టి ఈ సాధన వెంటనే ఆరంభించండి" అని ఆజ్ఞా పించారు. నా అంతరాత్మలోని తెరపై స్వామి బృందావనములోని ఇతర భక్తులకు దర్శనమిస్తూ మెల్లగా కను మరుగైనారు. మేము వాస్తవంలోనికి తిరిగి వచ్చాము.

మరునటి రోజు రాత్రి స్వామి ఎస్టైల్‌కు స్వప్నంలో

దర్శన మిచ్చారు. ఇది జరిగిన కొద్ది రోజులు ఈ అభ్యాసం స్వామి మాకోసమే తెలిపిన సాధనగా భావించి చేయనారంభించాము. అయితే తదుపరి జరిగిన సంఘటనలవల్ల ఎవరైనా ఈ సాధన చేపట్ట నచ్చని తేట తెల్లమయ్యింది.

పై సంఘటన జరిగిన కొద్ది రోజుల తర్వాత నేనూ, నా కుమార్తెకు, షీలా స్వామిని షీలాకు కల్గిన కొన్ని సమస్యల పరిష్కారమార్గం చూపమని వేడుకొంటూ ప్రార్థిస్తున్నాము. షీలా మానసిక శాస్త్రవేత్త. ఆమె దగ్గరకు అనేకమంది తమ తమ కష్టాలనెట్లా ఎదుర్కోవాలో తెలుసుకోవడం కోసం వస్తుంటారు. అట్లా వచ్చిన వారి సమస్యలను కూడా స్వామికి ధ్యానసమయంలో నివేదించి పరిష్కారాలు తెలుసుకొంటుంటాము. ఈ తడవ ధ్యానంలో స్వామి నా మనోఫలకం పై ఒక పాట పాడుతూ దర్శనమిచ్చారు. నేనుకూడా స్వామి ననుసరిస్తూ పాడ సాగాను. అట్లాపాడుతుండగా షీలా ఆపాటను వ్రాసుకొంది. అయితే ఆమె పాట రాగాన్నీ, తాళాన్నీ పట్టుకోలేకపోయింది.

"నమ్ముతున్నాం, నమ్ముతున్నామంటారే
గాని నమ్మలే కున్నారు।
ఏమి చేయాలి, ఏమి చేయాలనెప్పుడు వ్యాకుల
పడ్తుంటారు।
మీరడిగిన వాటినన్నిటినీ నేను చెప్పుతుంటాను
కానీ మీరు వినరు।
ఇది నా అవతార కార్యక్రమమనీ, లక్ష్యమనీ
చెప్పుతూ పోతుంటాను।
మిమ్మల్ని నా వద్దకు పిలచి, ఆకర్షించి మీకు
సత్యాన్ని బోధిస్తుంటాను।
మీకు ఎంత అవసరమో మీరు ఎంత ఉపయోగ
పెట్టుకోగలరో అది చెప్తుంటాను।
అందుకని___
అక్కర లేనిదానికంటే ఎక్కువ అడగవద్దండి.
అలా అని అసలే వూరుకో వద్దండి.
కానీ,___
మీకు రావలసినది నేను యిస్తానండి. నిజం నా
మాట మీరు నమ్మండి."

అంటూ స్వామి పాట ఆపి ఉపన్యాసం ఇవ్వనారంభించారు.

"మరీ ఎక్కువ కష్టపడి ప్రయత్నిస్తే జీవితం చాలా క్లిష్టమయిపోతుంది. ధ్యానసమయంలో మీ హృదయాంతరంగములో వున్న నిప్పు కణికమీద ఊపిరి వదుల్తూ, ఎట్టి వడుదుడుకులూ లేకుండా నన్ను చేరండి. ఆధ్యాత్మికంగా మీరు వివిధస్థాయిల్లో వున్నారు. నన్ను వేయి వాట్ల బల్బుగా భావిస్తే మీరంతా వివిధ వాట్ల శక్తి కల్గిన రక రకాల బల్బులు. ఒకే భగవంతుడు మీ అందరిలో ప్రకాశం కల్గిస్తున్నాడు. అయితే కరెంటు ప్రవహించడాన్కి ఒక మీటనొక్కాలి. దానికి ముందు మీరు మీలో వున్న నిప్పు రాజేయాలి. మీ ఊపిరితో మీలో వున్న బల్బు శక్తిని పెంచడానికి ప్రయత్నించి తద్వారా ఎక్కువ ప్రకాశవంతం చేసుకోవచ్చు. ఇది చాలా సులవు. మీ ఊపిరితిత్తులను గాలితో మెల్లగా నింపండి, ఆ గాలిని మెల్లగా మీ హృదయాంతరంగంలో వున్న నిప్పుకణికవైపు వదలి దానినుండి నివురును దూరంచేయండి. తద్వారా ఆ నిప్పుకణిక ఎక్కువ గాలినీ వేడినీ ఇస్తుంది. మీలో వున్న మాలిన్యాన్నీ, అహంకారమనే కప్పునూ తొలగించి, ప్రకాశాన్ని మూస్తున్న ముసుగును ప్రక్కకు నెట్టి నిప్పుకణిక మెరిపేట్లు చేస్తుంది. అప్పుడు మీరు నాకు చిన్న ప్రతీకలుగా మారవచ్చు మీ అభ్యాసాన్ని తీవ్రతరంచేసి, మీ పని ముట్టును శక్తివంతం చేయాల్సిన సమయం ఆసన్నమయ్యింది. మీ అందరిలోనూ

వున్న నిప్పును నేనే, దానిని ప్రకాశవంతం చేసుకోవ డానికి మీరు సిద్ధ మయినప్పుడు మీకు సాయ పడ్డానికి నేను తయారుగా వున్నాను. ఇట్లా చేసేపుడు మీలో మండుతున్న జ్వాలను బయటకు అందరికీ కనబడేలా చేయడానికి మీరు ప్రయత్నిస్తే నేను దానికి దోహదం చేయడానిక్కూడా సిద్ధంగా వున్నాను.'' అని ముగిం చారు.

ఈ అభ్యాసం ఇక్కడున్న మిగిలిన సాయిభక్తు లకు చెప్పి వారుకూడా దానివల్ల లాభం పొందేట్లు చూశాను. వారి అనుభవాలు చాలా ప్రోత్సాహకరం గానూ, వివిధస్థాయిలకు చెందినవిగానూ ఉన్నాయి అందువల్ల ఈ సాధనా విధానం ఎవరు అభ్యసించాలను కుంటే వారికి తెలుపవలసిన విధి నాకుందని భావించి ఈ వ్యాసం వ్రాశాను.

—ఫిలిస్ క్రిస్టల్.

## సాయిసన్నిధి చేరుకో!

నిన్నునీవే తెలుసుకో। జీవా!
నిశ్చలత సాధించుకో।
సత్యసాయిని వేడుకో। జీవా।
నిత్య ధర్మము నేర్చుకో।
పర్తివాసునిదలచుకో। జీవా।
కర్తయతడని నమ్ముకో।
సాయిపదములగొల్చుకో। జీవా।
జన్మబాధల మాన్పుకో। నిన్నునీవేతెలుసుకో॥
నిశ్చలంబగు భక్తితోడుత
నెమ్మనమున భజించుకో। జీవా।
తనివితీరగ సాయినామము
తలపులందున నిలుపుకో। జీవా! నిన్నునీవేతెలుసుకో॥
సాయినామము దలచుకో। జీవా।
సజ్జనులనే గూడుకో।
నందనందను తలచుకో—ఆ
నందకందుని నందుకో. జీవా। నిన్నునీవేతెలుసుకో॥
అంధకారము బాపుకో—భవ
బంధములనే త్రెంచుకో। జీవా।
ఎల్ల వేళల సత్యసాయిని
ఉల్లమందున నిలుపుకో! జీవా। నిన్నునీవేతెలుసుకో॥
పాపపంకిలమంతరించగ
పర్తిసాయిని కోరుకో! జీవా।
ఆదుకొనియెడు స్వామియుండగ
బాధలెల్లను మరచిపో। జీవా। నిన్నునీవేతెలుసుకో॥
సాయిప్రేమను బడసి నిరతము
సద్గతులనే అందుకో। జీవా।
మంచితనమును పెంచుకో। జీవా।
మాధవుని సేవించుకో। నిన్నునీవేతెలుసుకో॥
నామకీర్తన జేసుకో।
నరవరుని పూజించుకో! జీవా।
ఆత్మరూపుడు సాయియే—పర
మాత్మగా ధ్యానించికో। జీవా। నిన్నునీవేతెలుసుకో॥
నశ్వరంబగు జగతి మరచి
విశ్వమోహనువేడుకో। జీవా।
మాయజాలము వీడుకొని శ్రీ
సాయిసన్నిధి చేరుకో। జీవా। నిన్నునీవేతెలుసుకో॥

—రచన: నర్వా నారాయణరావు, వనపర్తి.

# పురాతన భారత విద్యావిధానం

సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, కర్తవ్య దృష్టి—వీటిని నేర్పు వారే గురువులు, నేర్చుకొన్న వారే విద్యార్థులు. ఈ గుణములే మానవునికి ఇహపరములను ప్రసాదించు సాధనలు. మనుజులను దనుజులుగా మార్చు దుర్గుణములను దూరము చేసే విద్య ఇదియే.

విద్యావిధానముయొక్క ఆదర్శములు రెండు, అని అనేకులు చాటుచున్నారు. ఒకటి: ప్రపంచమందు సంఘమందు కూడుగుడ్డలకు ఇబ్బంది లేక అనుకూలములను అందించే విద్య. రెండవది: ప్రపంచ సుఖదుఃఖములతో సంబంధము లేక, ఆధ్యాత్మిక పథమును ప్రవేశపెట్టి, సాక్షాత్కారమునందించే విద్య. అయితే, ఇవి రెండూ భిన్నము కావు; అవినాభావముచే బంధింపబడినవే. దీనిని, విద్యార్థులూ గురువులూ చక్కగా గుర్తించవలెను.

మనిషి చేతులు కాళ్లు మనస్సు ఇంద్రియములు వీటితో తయారైన ఒక వస్తువు కాదు. దీనిని ఆవరించి అతీతమైన ఒక వ్యక్తిత్వమున్నది—అదే ఆత్మ. అది చర్మచక్షువులకు గోచరము కాదు. ఇతర ఇంద్రియములకుకూడ అగుపడేది కాదు. అది దృశ్యములకతీతము. ఇంద్రియగోచరమంతా జగత్తు; ఇది జగత్తునకు ఆధారమైనది. కనుపించునవన్నీ కనిపించని ఆధారముపై నిలిచియున్నవి. వృక్షమునకు వ్రేళ్లు ఆధారము; భవనమునకు పునాది ఆధారము. ఆత్మ అనే ఆధారముపై, జీవ జగత్తులు రెండూ నిలచియున్నవి.

మూడు నాలుగు శతకములక్రింద విదేశీయులు భారతమును ప్రవేశించినపుడు మన విద్యావిధానమందు ఏవో కొన్ని విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉన్నవి. వాటికి అంద చందములతో కట్టబడిన భవనాలు లేవు. మహాపండితులు ఒకరి గృహమే కాలేజి. పది లేక నాలుగైదు విద్యార్థులు మాత్రమే, ఆయన దగ్గర విద్య నభ్యసించే వారు. పాఠప్రవచనములకు కాలపరిమితి నియమించటము అనే పద్ధతి ఆనాడు లేదు. గురువుయొక్క అనుగ్రహము, శిష్యునియొక్క అపేక్ష—వీటిని పట్టి విద్యాబోధ జరుగుచుండెను. ఏచోటో ఏ సమయమో అర్ధరాత్రిసమయమందుకూడ, ప్రశాంతవాతావరణము, దొరికినపుడెల్ల పాఠములు; క్లాస్‌రూం అనేది ఏది: దేవాలయప్రాంగణమో, వృక్షఛాయనో, వారికి అదే గది. అట్టి పవిత్రస్థలమందు అభ్యాసముజరిగినప్పుడు దేవాలయమునకు వచ్చు భక్తులూ, వృక్షము దగ్గరతిరుగాడు పవిత్రహృదయములు ప్రజలుకూడ విషయములను అందుకొనుటకు అవకాశముండేది.

ఒక్కొక్క విశ్వవిద్యాలయమందు ఒక్కొక్క విషయమును ఆ నాడు ప్రత్యేకంగా బోధించు పద్ధతి. కాశీ విశ్వ విద్యాలయముయొక్క అభిమానశాస్త్రము, వ్యాకరణము. కాశ్మీరములోని సంస్థకు అలంకారశాస్త్రముపై అభిమానమెక్కువ; తక్షశిలలో ఆయుర్వేదముపై ఎక్కువ శ్రద్ధ; ఉజ్జయినీ విశ్వవిద్యాలయము గణితశాస్త్రములో ప్రత్యేక ప్రసిద్ధి పొందినది; నవద్వీపమందు న్యాయశాస్త్రపండితులు బహుమంది. తమ తమ అభిమానశాస్త్రమును తాము శ్రద్ధగా బోధింతురు.

శ్రీరాముని తమ్ముడు భరతుడు పరిపాలించిన నగరము, అమరావతి. అక్కడ విశ్వవిద్యాలయము వైద్యశాస్త్రమును అభిమానశాస్త్రముగా ఏరుకొని చరక శుశ్రుతాదుల పద్ధతులను నేర్పించినది.

శాస్త్రవిషయములను మాత్రమేకాక, నీతి నిజాయితీతో జీవితమును సాగించేదెట్లు, భాషాశుద్ధితో మాట్లాడేదెట్లు, సౌభాగ్య సౌశీల్య స్వభావముగల ఆదర్శములనెట్లు నిత్యజీవితములో ఆచరించేది, వీటినికూడ ఆచరణరూపమైన ప్రచార ప్రబోధములద్వారా విద్యార్థులు అందుకొనుటకవకాశముండెడిది, మానవత్వమును అభివృద్ధి పరచుటకు దివ్యత్వమును ప్రకటించి ప్రకాశింప జేసేదే ఏకైక మార్గము. ఈ లక్ష్యముపై ఆ నాటి విశ్వవిద్యాలయాలు ఎక్కువ శ్రద్ధ వహించినవి.

మరొకటి: ఆనాటి విశ్వవిద్యాలయాలు బంధనలో చిక్కక, విద్యాభిమానుల విద్వాంసుల ఆశయాలను మాత్రమే గమనించి కార్యరూపముగా ఆచరించినవి. సరస్వతీదేవి స్వేచ్ఛావిహారము చేసి అందరినీ ప్రోత్సహించినది. ఆదేవి అనుగ్రహించి ఆకర్షించిన విద్యార్థులను వరించి భరించి తరింప జేసే కర్తవ్యమును నేరవేర్చినవి.

ఆ నాటి విద్యాభిమానుల లక్ష్యము విద్యాసంస్థల సువ్యవస్థ, మరియు, విద్యావిధానముపై నిలిచినది· ప్రథమపాఠశాల, ఉన్నతపాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయం అనే సంస్థలలో, వారి శ్రద్ధ ఎక్కువగా ప్రాథమిక పాఠశాలపై పడినది. లేత హృదయములలో నిర్మల నిష్కల్మష నిస్వార్థ హృదయములలో తియ్యని భావాలను పెంచవలెననేది వారి ఉద్దేశ్యము. విద్యావిధానమును నిర్ణయించు సందర్భమందు ఏకాలమందు, ఎంతకాలము, ఎలాటి విషయము, ఎలాంటి గురువులు, ఎట్టి విద్యార్థులకు శిక్షణ నందించాలి అని వారు గమనించిరి. భిన్నభిన్నమైన ఆశయాలు, ఆశలు, వాంఛలు గల విద్యార్థులకు వేరు వేరు రీతిగా విద్యనందించాలి. అని వారు సంకల్పించి విద్యావిధానమును తీర్చిదిద్దిరి, వారి వారి అభిరుచిని ఆకర్షణలను పురస్కరించుకొని బోధించేవారు.

విద్యారంగములో నిర్బంధమునకు స్థానం లేదు. 6 నుండి 10 మంది మాత్రమే విద్యార్థులు కాబట్టి, ఒకొకరికి సూటిగా నాఊరీతిగా బోధన జరుగును. సందేహం కలిగినపుడు తక్షణమే గురువుగారు తానే గుర్తించి, పదే పదే బోధించి అర్థమయ్యేవరకు విషయమును వదలరు. గురువులకు కర్తవ్యభావము; శిష్యులకు విద్యాభిమానము. ఇహమును జయింప హేమతారక విద్య, పరమును సాధింప బ్రహ్మవిద్య—రెండూనూ సమన్వయ పరచిరి వారు.

శ్రవణముద్వారా పెద్దలు అనుసరించే విధానములను పరికించి తిలకించి విద్యలను వశము చేసుకొనే వారు. కమ్మరి కుమ్మరి వడ్రంగి విద్యలుమాత్రముకాదు. వ్యవసాయం, సంగీత, సాహిత్య, శిల్పచిత్రకళలను కూడ అంతే. పుస్తకాలు ఆనాడు ప్రజలకు లేవు. దివ్యమైన విద్యను, భవ్యమైన హృదయముతో నవ్యమైన మార్గమందు నేర్చుకొనే వారు, నేర్పువారికి కూడ, శ్రవణమే ప్రధానం.

భారతదేశము ఈనాడు సుందరమైన ఒక నందన వనము; అనేక రంగులుగల పుష్పములు వికసించి హృదయానందము నందించే ఉద్యానము. హిందువులు, ముస్లీంలు, క్రైస్తవులు, బౌద్ధులు, పార్సీలు, జైన్లు మొదలగు పుష్పముల నందనవనం. అనేక భాషలతో మతాలతో ఆధ్యాత్మికసాధనలతో కళావంతమైన దేశం. సర్వ మతముల సమత్వమును పోషించిన దేశము.

౦లు అనేక దేవతలను ఆరాధిస్తున్నారు, వారికి దేవుడు ఒకడే అని తెలియదు, అనే ఆపోహలు చాలా పొరపాటు. నిజముగా, సర్వదేవతా స్వరూపు లైన దేవుడు ఒకడే, అనే శాసనము భారతదేశమందే అనాదికాలము నుంచి ప్రజల విశ్వాసము.

వృత్తికొక అధిష్ఠాన దేవత, కర్మకొక అధిష్ఠాన దేవత అని ప్రత్యేకించలేదు. అన్ని దేవతలు ఒక దైవముయొక్క శక్తివిశేషములే అని నమ్మి ఆరాధన సలిపిరి. దైవత్వాన్ని చరాచరములలోనూ జడవస్తువులలోనూ, సకలప్రాణులలోనూ మృగపక్షిక్రిమి కీటాదులలోనూ దర్శించిరి. లారీ నడిపించే వాడు స్టీరింగు పట్టేముందు, దానికి నమస్కరించి, అపాయము లేకుండ ప్రయాణము జరుగవలెనని దైవమును ప్రార్థిస్తాడు. వాని మతము ఏదైనాసరే, దేవుని వేడుకొనక, ముందంజవేయడు. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, గాయకుడు, శిల్పి, పుస్తకాలువ్రాసే సాహిత్యకవి, పండితుడు అందరూఅంతే, ఆధ్యాత్మిక భావమును ప్రదర్శించే వారే. దీని అంతరార్థమేమి? అముష్మికము, ముందు; భౌతికము, తరువాత! ఇది పాశ్చాత్యులకర్థం కాదు. వారు, భారతీయులు చెట్టు, గుట్ట, రాయిని కాయితము వీటిని దైవమని పూజింతురు అని పరిహసింతురు. భారతీయులు తెలివితక్కువ వారు కారు; వారిది మూర్ఖత్వం కాదు, పవిత్రభావమే, పూర్ణజ్ఞానలక్షణమే. రాయికూడ దైవమని వారి భావము కాని, దైవము రాయి అని కాదు. 'ఈశావాస్య మిదం సర్వం.' సర్వమూ దైవమే; ఆ విశ్వవిరాట్ స్వరూపముయొక్క అంశములే, అంగములే. అన్ని కర్మలూ, కార్యములూ దైవమునకర్పితమే; దైవ కృప లేక ఏదీ జరగదు. కాబట్టి, ఏపని మొదలు పెట్టినా, దైవారాధన అగత్యముగా ఆచరించేతీరాలి.

ఇంద్రియములు మనస్సు చిత్తము బుద్ధి అహంకారము వీటన్నిటికీ, అతీతమై ఆత్మతత్వమే, ఆధారము. దానిని స్మరించి, కర్మములను సాధిస్తూ పోవలెను. ఆనాటి విద్యావంతులనూ, ఉపాయుధ్యాలనూ, ప్రజలే పోషించిరి. కేవలము పొట్టకూటి కోస్కరము కాదు, ఆత్మతత్వమును నేర్పుటే జన్మసార్థకము అనుకొనే వారు, ఉపాధ్యాయులు విద్యార్థులూ అంతే. దానినే నేర్చుకోవాలి అని తహతహలాడే వారు. పండితులకు అగ్రహారములనిచ్చి ప్రోత్సహించే రాజులు, వారిని గౌరవించి వారి సలహాలను పొంది ఆటీతిగనే నడచే ప్రజలు, ఇట్టి స్వార్థరహితమైన జీవితము ఆనాటిది. తమ కామపుత్రులకు సమముగానే శిష్యులైన ప్రేమ పుత్రులను ప్రీతితో చూచేవారు, ఉపాధ్యాయులు. వారందరూ త్యాగశీలురు; కష్ట జీవులు; వారిపై ఎవరూ, ప్రభుత్వముకూడ, చర్యతీసుకోరు. ఎందు కనగా, వారికి శ్రమయే సంపద. వారు ఆనందమయులు; కర్మశూరులు.

విద్యార్థులు ఆనాడు విద్యనాశించి అర్జించేదికూడా ఉద్యోగముకొరకుకాదు. గుణధనము పెరగాలి, చిత్త శుద్ధి సంపాదించాలి. దేశమునకు సంఘమునకు కుటుంబమునకు సేవనందించే శక్తిసామర్థ్యములనార్జించాలి అనేది వారి లక్ష్యము. ఆశలకు లొంగినవాడు నిజముగా దరిద్రుడు; తృప్తి, తుష్టి, పొందినవాడు శ్రీమంతుడు. తల్లి దండ్రులను పోషించి తృప్తిపరచే విధానములను విద్యార్థులు ఈనాడు తెలుసుకోవాలి. వారిని విద్యాశూన్యులు అని చిన్నపరచకూడదు. పుస్తక పరిజ్ఞానము వారికి లేకుండవచ్చును. అయితే హృదయపరిజ్ఞానమున్నది. వారిని హింసించి వారికి బాధ పెట్టి, కంటినీరు కురిపించకూడదు. వారిని ప్రేమించి గౌరవించి వారికి సేవ చెయ్యాలి. వారిని తిరస్కరించి దూషించి అగౌర పరచకూడదు. అందరితోనూ

వినయవిధేయలతో మెలగాలి. అహంకారము మిమ్ము లని ఏనాటికైనా హీనపరచును, శిక్షించును. తన హృదయమే తన్నుహింపిస్తుంది. ఎల్లప్పుడూ రామ కృష్ణ గోవింద అని భగవన్నామస్మరణ చేసిన, అహం కారము దూరమగును. ఫుట్‌బాల్‌లో నిండుగా గాలి ఉండేవరకు దానికిదెబ్బలు తప్పినది కాదు, కదా? మన జీవితమే ఫుట్‌బాల్; అహంకారమే దానిలోని గాలి. ఆధ్యాత్మిక సాధనలద్వారా, అహంకారమునకు మూల కారణము; అహంకారము నశించిన, ఆత్మానందము నందుకోవచ్చు.

దానికి డిగ్రీలు పనికి రావు, దైవానుగ్రహము అత్యవసరం. బహుళగ్రంథపఠనమక్కరలేదు. దైవా నుగ్రహము దొరకుటకు చిత్త శుద్ధి సేవాబుద్ధి, కర్తవ్య నిష్ఠ, ప్రేమాభివృద్ధి కావాలి. విద్యార్థులు విద్యనార్జించే సమయమందు, మిగిలిన రంగములలో ప్రవేశించ కూడదు. అట్లు చేస్తే, విద్య కుంటుబడును. హృదయ మును పరిశుద్ధముగా వుంచుకొని సోదరమానవులను ప్రేమించండి. క్రమశిక్షణను ఒక సబ్జెక్టుగా పరిగ ణించి, ఆధ్యాత్మికమును అతిశ్రద్ధతో అభ్యసించండి.

—దివ్యోపన్యాసము సత్యసాయికాలేజి,
బృందావనము 10-7-80

# సేవాసైన్యం కదిలింది

సేవాసైన్యం కదలింది
జాతికి దైన్యం వదిలింది
సాయిరాముని శంఖారావం
జాతిని నిద్దర లేపింది మనజాతిని నిద్దరలేపింది

మహిమల చేశాడు
బాబా, మనుషుల నాకర్షించాడు
మనిషిని తట్టి దేవుని చేసే
నిజమగు మహిమను చూపాడు, బాబా సేవా॥

మనసు మంచిదియైతే
మతమేది చెడ్డది యన్నాడు
మతములనన్నీ రుచిచూపే
సనాతన సారథినేనన్నాడు సేవా॥

"నీవేదనలన్ని నాకు నివేదన చేయి
నీవే వేదమయుడవోయీ
నీ నిజస్వరూపాన్ని దర్శించే
నావెలుగులోన స్థిరపడవోయి"
అంటూ చేయూత నిస్తున్నాడు బాబా
హృదిహృదిని తడుతున్నాడు సేవా॥

భేదాలు కరగాయి
నీప్రేమ ప్రవాహంలో
తేడాలు తొలగాయి
నీదివ్యస్పర్శతో

అంతరాలు మరిలేవూ
అంతర్యామివి నీవూ
అందరివాడివు నీవూ
అసలిందరుగా వున్నదినీవు సేవా॥

-యమ్. కృష్ణస్వామి యమ్. ఎ.

# సేవాధర్మము

అభాగ్యులకు సేవచేయవలెనను ఉదాత్తభావము మనలో అంకురించుటకుగల మూలకారణమేమి? మనము భగవానుని ప్రేమస్వరూపుడని, కరుణామయుడని, ఆపద్బాంధవుడని కీర్తిస్తుంటాము. నిత్యజీవితమున మనము అనుభవించు పలురకములైన దుఃఖములు, ఆపదలు స్వకీయ కర్మానుసారము అనుభవించవలసి యుండును. అట్లయిన దైవసంబంధమగు ప్రేమ కరుణలతో వారికి ప్రయోజనముండదు గదా యని కొందరు తలపోయవచ్చును. ఇది సరియైన భావనగాదు ఇచ్చట ఒక ఉదాహరణమును పరిశీలింతము. దుష్కర్మ ఫలితముగ ఒక ప్రమాదమున అంగవైకల్యము పొందిన తన కుమారుని జూచి ఒక తండ్రి అమితమగు పరితాపము జెందుట సహజము గదా. దీనికి కారణము నశ్వరమగు రక్తసంబంధమైన పుత్రప్రేమయే యగును. ఈ మమకారమువలననే తండ్రి కరుణాంతరంగుడై కుమారుని దైన్యస్థితిని జూచి విలపించుటయేగాక సుస్థితిలో యున్న ఇతరకుమారులకన్న అతనిని అధికముగ ఆదరించును, ఆదుకొని అండగా నిలచును. అట్టి యెడ లోకపితయైన పరమాత్మకూడ శాశ్వతమును, అత్యంత సన్నిహితమునగు ఆత్మసంబంధమైన నిర్మల ప్రేమ కారణమున ప్రారబ్ధవశాత్తు దుఃఖితులమగు మనలను జూచి జాలిపడుటలోను, సానుభూతితో ఆదరించుటలోను ఆశ్చర్యమేమున్నది. మనము దైవస్వరూపులము. రూపసామ్యము ననుసరించి పరమాత్మ కృపాపూర్ణుడై మనలను ఓదార్చుటకూడ అత్యంత సహజమగును. భగవత్సంకల్పము సంచిత ఆగాములతోపాటు ప్రారబ్ధకర్మమును సహితము నిర్మూలించగలదని బాబా ఉద్ఘాటించిరి. ఈవిధముగ భగవానుడే దుఃఖసమయములందు మానవులను వారి వారి దోషముల నెంచక దీనవత్సలుడై, ఆర్తత్రాణపరాయణుడై ఆదరించుచుండ కష్టసమయములందు మనమునూ ఇతరులను ఆదరించుట, వారికి సేవ చేయుట, సర్వోత్తమ ధర్మముగా శాస్త్రములు ఘోషించుచున్నవి. అందుచేతనే ఆర్షసాంప్రదాయమున భూతదయ అత్యుత్తమస్థానమును సంతరించుకున్నది. భూతదయ ఈశ్వరలక్షణమనియు అందువలన భూతసేవ మానవుల పరమ లక్ష్యము కావలెననియు రామకృష్ణ పరమహంస నుడివిరి. మానవసేవయే మాధవసేవయనుటకు బదులుగా భూతసేవయే భగవానుని సేవయనుట సమగ్రసేవా లక్ష్యముకాగలదు.

శ్రీ సత్యసాయి ధర్మప్రబోధలో సేవాధర్మము దివ్య భావాత్మకమైనది. అది కేవలము లౌకికపరమైన సాంఘికధర్మము మాత్రమే కాదు. పరమాత్మ సర్వజీవ రాసులందును వ్యాపించియున్నాడు. ''మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః'' అని గీతాచార్యుని ప్రవచనము. కాన సర్వభూతముల హితమును కోరుటయే సర్వేశ్వరునికి ప్రీతిపాత్రమగు కార్యము కాగలదు. ఈ సంబంధముననుసరించియే జగత్ప్రభువగు మాధవుడు యుగ యుగ మందును అవతరించి ఈ సేవా ధర్మమును ఆదర్శవంతముగ నిర్వహించుచున్నాడు. అటులనే కలియుగఅవతారియగు బాబా కూడ తన అవతారలక్ష్యమును సేవాసంస్థలద్వారానే నిర్వహించుట

మన్నార్థము. 'సాయియోగ' మనునది సేవాయోగమే. ఇది సాయి భక్తులకు సహజకృత్యము కావలెను.

ఈసేవ అనేకరూపములలో ప్రవర్తిల్లును. 1. మాతా పితృసేవ 2. గురుసేవ 3. అనాధసేవ 4. వృద్ధులకు, రోగులకు, వికలాంగులకు చేయుసేవ 5. ఆపత్కాలమున దురవస్థలకు గురియైన వారికి చేయుసేవ 6. బీదలకు చేయుసేవ 7. అజ్ఞానాంధకారంలో అవ్యక్త మార్గం పట్టి అలమటిస్తున్నవారికి చేయుసేవ 8. పశుపక్ష్యాదులకు చేయుసేవ మొదలగునవి. సేవాధర్మనిర్వహణమునకు మనలోని భావము ముఖ్యము కాని బాహ్యాడంబరములు ప్రధానముకాదు. సహజ సిద్ధమగు ప్రేమయు సుహృద్భావమును లోపించియుండ కేవలము పేరు ప్రతిష్ఠలకొరకే అన్న సత్రములు కట్టించినందునను, గోదాన, భూదాన, విద్యాదానాది పుణ్యకర్మలు చేసియున్నందునను అవి వాస్తవ సేవాధర్మసాధనములుగా ఫలించజాలవు. సేవారూపమున ఏవోకొన్ని భౌతికమైన సౌకర్యములు, సదుపాయములు కల్పించినంతమాత్రమున దానిని దీనజనోద్ధరణగా భావించుట ఆశించదగిన పూర్ణలక్ష్యము కానేరదు. బాబాలాంటి అవతార పురుషుల దృష్టిలోని సేవాధర్మమునకు ఇంతటి సంకుచితార్థమును స్ఫురింపజేయుట అసంగతము అపచారము కూడ. సేవయనునది మానవునియందు ఆంతరికమైన పవిత్రతకు, దివ్యతేజోవిలసితమైన పరిపూర్ణతకు దోహదపడవలెను. సేవనందించువారిని అట్టి సేవను గ్రహించువారిని ఉభయతారకముగ ఈ సేవ పవిత్రీకరించవలయును. ఉభయులను దివ్యగుణ, భవ్యగుణ సౌరభసంపన్నులనుగా తీర్చిదిద్దవలెను. సేవను ఫలాభిసంధిరహితముగ ఈశ్వరార్పణబుద్ధితో చేయవలెను. అట్లే దానిని ఈశ్వరప్రసాదముగ స్వీకరించవలెను. అట్టి యెడ అది దైవకైంకర్యముగ భాసించి ఆత్మవికాసమునకు తోడ్పడును. స్వార్థమును పూర్తిగ త్యజించి పరార్థమునకు పాటుపడవలెనను సామాన్య నైతిక స్థాయిని కూడదాటి పరమార్థస్థాయిని అందుకొనవలెను. సేవాసాధన మనునది నిస్సంశయముగ సర్వజనసాధ్యమైన సులభతరముక్తిమార్గము. దీని ద్వారా అనేకత్వములోని ఏకత్వమును, మానవత్వములో మాధవత్వమును అనుభూతికి తెచ్చుకొనవలెను. అప్పుడే అది ధర్మనిష్ఠ. కర్మనిష్ఠ, బ్రహ్మనిష్ఠలతో కూడిన జ్ఞానయజ్ఞముగ సంశోభించుటయే గాక తరించుటకు నావగ ఉపకరించును. లేనిచో అది కేవలము లౌకికమైన సామాన్యపుణ్యకర్మలతో ముడిపడి తత్ఫలితములగు నిస్సారమైన భోగవిలాసములందు ద్రిప్పుచు హృదయగ్రంథిని మరింతగ దృఢపరచును. జనన మరణరూప దురవస్థ యింకను కొనసాగించును. యజ్ఞమునందలి సమస్త హోమసాధనములు, హోమముచేయువాడు, హోమము చేయబడినది. అన్నియును బ్రహ్మస్వరూపములే యనెడి ఏకాగ్రభావముతో ఆ యజ్ఞయాగాది కర్మలను జేయుమనుజుడు బ్రహ్మమునే పొందగలడు అను గీతావాక్యము సేవా ధర్మమునకు ఏకైకలక్ష్యముగా భావించవలెననునది సాయిగురునాథుని సూక్తిలోని అంతరార్థముగ మనము గ్రహించవగును.

నిష్కళంక సేవాధర్మమును నిర్వర్తించుటకు ధనకనకవస్తువాహనాది పటాటోపములతోగాని, అధికార దర్పములతోగాని అవసరములేదు. పవిత్రాంతఃకరణతోకూడిన సేవానిరతిమాత్రమే అవసరము, ఆవశ్యము. ఈక్రిందివిధముగ మనము 'సాయియోగ' మును సేవాయోగమును ఆచరించవచ్చును. బాహ్యదృష్టికి "ధర్మము ఒకింతైనను గొప్పభయమునుండి కాపాడును'' అని గీతాసూక్తి. "స్వల్పమప్యస్యధర్మస్యత్రాయతే మహతో భయాత్''(2. 40)

మాతాపితరులకు మనవలన ఎటువంటి శారీరక మానసికక్లేశములు కలుగకుండ వారికి సుఖశాంతులు కలుగునట్లు చేయుట గురువులను గౌరవించి వారి అజ్ఞానుసారము నడచుకొనుచు అవసరమగు శుశ్రూష చేయుట. దుఃఖితులైనవారిని ప్రేమవాక్కులతో ఓదార్చి వారికి మానసికశాంతిని కలిగించుట. అవకాశము కలిగినప్పుడు వికలాంగులకు, రోగులకు, వృద్ధులకు. అవసరమైన పనులు చేసి పెట్టుట. ఆకలిదప్పులతో అలమటిస్తున్న అనాధులకు, దిక్కులేనివారికి కృపాదృష్టితో శక్తికొలది సహాయపడి వారిని సంతోషపరచుట. సత్కార్యములు చేయువారిని, చేయుకుతూహలముకల వారిని ప్రోత్సహించి వారికి తోడ్పడుట. సన్నిహితులైన వారు, మనపై విశ్వాసము కలవారు తెలిసి తెలియక అక్రమముగా సంచరించునప్పుడు ప్రేమపూర్వక సుహృద్భావముతో వారిప్రవర్తనను సరిదిద్దుట. ఆత్మవిమర్శన చేసికొని పవిత్రాచరణతో ఇతరులకు చక్కని ఆదర్శమును అందించుట. వేదప్రతిపాదితమైన ధర్మములను యధాశక్తి ఆచరించుచు వాని వ్యాప్తిని, ఆచరణను పునరుద్ధరించుటకు కృషి సలుపుట. మన మాటల వలన, చేతలమూలమున పరులకు ఏ విధమైన బాధ కలుగకుండునట్లును, వారికి నిర్మలమైనహృదయానందము కలుగునట్లును ప్రయత్నించవలెను, అవకాశము లభించినపుడెల్ల పశుపక్ష్యాదులను సహితము దైవస్వరూపములుగా భావించి వానికి ఉచితరీతిని సహాయపడుట. 'అద్వేష్టాసర్వభూతానాం' 'సర్వ భూతహితే రతాః' అని గీత నొక్కిచెప్పుచున్నది అవతార పురుషులను మహాత్ములను సమీపించి వారికి వినయముతోను భక్తితోను ప్రేమతోను నమస్కరించి వారికి మన పవిత్రహృదయమును, సత్సంకల్పములను సత్కార్యములను, వాని ఫలితములను అహంకారరహితముగ అర్పించవలెను.

పరమాత్మ సర్వవ్యాపిగనుక సమస్త జీవరాసులు ఆత్మస్వరూపులేగనుక ఆత్మౌపమ్యభావముతో మనము ఈచరాచరసృష్టిని మనసార ప్రేమించాలి. ప్రేమవలన సుహృద్భావము కలుగును. దానివలన త్యాగసమృద్ధమైన సేవానిరతి జనించును. సేవాధర్మము సర్వేశ్వరధర్మముగా గ్రహించవలెను. దీనివలన అహంకార మమకారములు నశించును. చిత్తసంశుద్ధిచేకూరును తద్వారా ఆత్మానుభూతి, ఆత్మసాక్షాత్కారము లభించును. ఈ సత్యమునే బాబా తన కార్యక్రమముద్వారా లోకమున ప్రత్యక్షానుభవములతో చాటుచున్నారు. ఈ కారణముననే 'శ్రీ సత్యసాయిసామ్రాజ్య' స్థాపనకు 'Service in God' అను దివ్య సూక్తి ఆధారభూతమైనది.

స్వామి ప్రేమస్వరూపుడు, సత్యస్వరూపుడేగాక సేవాస్వరూపుడుకూడ. "చేతులు పవిత్రకార్యములందు నియుక్తము కావలెను. లోపల ఈశ్వరస్మరణ బైట స్వధర్మాచరణ చేతిలో సేవాకర్మ మనస్సున వికర్మ ఇవి నిత్యకార్యక్రమము కావలెను." అని 'ప్రేమవాహిని'లో స్వామి ప్రకటించిరి. ఈశ్వరధర్మమగు సేవాధర్మమే మానవాకృతిని ధరించి కలియుగమున శ్రీవారు అవతరించినారు. కృపాపూర్ణుడైన స్వామి మనలను ఉద్ధరించుటకుగాను అత్యంత సులభమగునదియు సర్వజన సుసాధ్యమైనదియునగు సేవాధర్మమను జీవిత తరుణోపాయమును మనకు అందించి నారు. ఇట్టి ఉత్తమధర్మముయొక్క వైశిష్ట్యమును బాగుగా గుర్తెరిగి త్రికరణ శుద్ధిగా మనము దానిని నిత్యజీవితమున ఆచరించుచు ధన్యులమగుదుముగాక.

—డి. వి. కృష్ణారావు. హైద్రాబాద్

# సత్యసాయి విద్యావిధానము

(సోనంగ్యాట్సో—సిఖింరాష్ట్రం)

ధూళిగప్పిన జీపుకారు 'గాంగ్‌టోకు' వైపు పరిగిడుతున్నది. రహదారి ఎగుడు దిగుడులు మిట్ట పల్లాలతోనిండియుండినది. మా జీపు మలుపులరోడ్డుపై ముందుకు పరుగిడుతుంటే, దేవదారు, భద్రదారు తరువులు వెనుకకు పరుగిడుచున్నట్లగుపించుచుండెను. నేనా జీపులోనుంటిని. గడచిన సంవత్సరాలు శ్రీభగవాన్ బాబావారి సాన్నిధ్యములో నేను గడపిన కాలమును గురించి దీర్ఘాలోచనలో పడిపోయినాను. ఎన్నోమైళ్ళదూరంలోని పవిత్ర బృందావనమునకు గొనిపోబడినట్లు అను భూతిని పొందితిని. బృందావనములో స్వామివారి పవిత్రప్రేమను బడసితిని. స్వామివారి పాదసన్నిధిలో స్వామివారి మహిమను స్తోత్రము చేసి వారి కనికరమునకు పాత్రుడనైతిని. ఇటువంటి మనో భావములు నాలోని ఆనందసాగరమును మథించినవి.

ఆకస్మికమైన కుదుపు, ఊపు నన్ను నా యథార్థ స్థితికి దెచ్చినవి. నా ముందు నిశ్చలముగా నిలచిన వాహనముల వరుసను జూచితిని. అప్పటికి మేము నగరపు పొలిమేరను సమీపించుచుంటిమి; దాదాపు పట్టణమునకు అరమైలు దూరమందుంటిమి. జనవాహనాదుల రాకపోకలు ఏ కారణముచేతనో స్తంభించిపోయినవన్న సంగతిని జీపుడ్రైవరు మాకు తెలియబరచినాడు. ప్రాయశః కారణము అతనికి కూడ తెలియదు. మంచిగాలి విస్తారముగా వ్యాపించియుండెను. దానిని ఆస్వాదించుటకై క్రిక్కిరిసిన మా వాహనము నుండి తోటి ప్రయాణీకులు క్రిందకు దిగిరి. నేను కూడను జీపునుండి దిగితిని. ఆవల రోడ్డు కొనన అసంఖ్యాకమైన వాహనములు వరుసగా నిలబడి యుండెను. అటువైపు వెళ్ళితిని. ఆ వాహనాదులన్నిటికి ముందు రాష్ట్రప్రభుత్వ శకటముండెను. అచ్చటికి నడచితిని. అదొక పెద్ద ప్రజా సందోహము. ఏక కంఠముతో చేయునినాదములను వింటిని. అవి గవర్నమెంటు హయ్యర్ సెకండరీ పాఠశాల ప్రిన్సిపాల్ గారిపై అష్టోత్తర శతనామావళులు. అంతా యువతరము విద్యార్థులు. కరపత్రములు, జెండాలు పట్టుకొని ఊరేగింపు చేసుకొంటున్నారు. ఆ ఉత్సవమును తిలకించిన కొందరు అదృష్టవంతులలో నేనొకడను: ప్రిన్సిపాల్‌గారిని తక్షణమే బర్తరఫ్ చేయాలని కోరుతున్నారు. ఏ మా ఔత్సుక్యము! ఏమి పట్టుదల! ఎంతటి అవివేకులు! వారలందు అకస్మాత్తుగాతోచిన దురదృష్టకరమైన ప్రేరణా ఫలితమే ఇది. కాని, వీరిని ఉత్తేజపరచి, వీరిలోని దౌష్ట్యప్రేరణలను పారద్రోలిన యెడల వీరిలో ప్రతియొకడును మహాను భావుడగునని భావము ఉన్నట్లుండి నాకు స్ఫురించినది.

బృందావనములో వారమునకు రెండు సార్లు విద్యార్థులు నగరసంకీర్తనలో పాల్గొంటారు. అందులో స్వతః నేను పాల్గొనుచుంటిని. బృందావనపు ఊరేగింపులో అక్కడ నడుస్తున్న యువకుల ఊరేగింపును పోల్చకుండ ఉండలేక పోయినాను. బృందావనమందలి విద్యార్థులు, గాంగ్‌టోకు విద్యార్థులవలె

గాక, సద్గురు సాయియొక్క మహిమను స్తోత్రము జేయుచూ (నామసంకీర్తన జేయుచూ) ఉషఃకాలమందు పురవీధులవెంబడి దిరిగివత్తురు. అకటా! వారు— వీరలలో నెంతవ్యత్యాసము!

బోర్డు ఆఫ్ ఎడ్యుకేషన్ లేదా యూనివర్సిటీ అధికారులకు విరుద్ధముగా తిరుగు బాట్లు సాగించుటకై యువకులు ఊరేగింపులు చేయుట పరిపాటి; ఇవి దేశమందెల్లడలను సామాన్యముగ నగుపించు దృశ్యములే! ఇట్లుండగా వివేక శూన్యులు, బాధ్యతారహితులు నైన తల్లిదండ్రులు తమ పిల్లలు 'ఎంతటి రాజకీయచైతన్యము కలవార'ని ప్రగల్భాలాడుచుందురు. బృందావనమందలి బాలురు—గాంగ్‌టోక్ బాలురు—భారతమాత బిడ్డలే! బృందావనమందలి విద్యార్థులు శ్రీసాయిజగద్గురు పాదముల చెంత కూర్చుందురు. తమ సేవను భగవానుల కంకితముచేస్తారు. యుగయుగములనుండి ప్రాచీన ఋషులు, జ్ఞానులనుండి సంక్రమించిన వాస్తవ విజ్ఞానామృతమును గ్రోలుదురు. కాని, ఇదేభారతావనిలో ఇతరప్రాంతములందున్న పరిస్థితులు వేరు.

క్రమశిక్షణను విధించుటలో ఉపాధ్యాయులను విద్యార్థులు ప్రశ్నించేటంతటి పరిస్థితికి వచ్చినారు. విద్య గరపు ఉపాధ్యాయుడు. విద్యనేర్చుకొను విద్యార్థుల మధ్య పరస్పరము మైత్రినెలకొన్న మంచిరోజులు గతించినవి. ఈనాడు ప్రతివాడు ఏదో ఒక విధముగా డిగ్రీలు లేదా డిప్లమోలు సంపాదించుకొనే ప్రయత్నములో నున్నాడు. క్రింది సోపానముపై పాదమునూరకయే విచ్చెన పైమెట్టుపై కాలూను ప్రయత్నములో ప్రతివాడు తన్ను తాను మోసపుచ్చుకొంటున్నాడు. ఇంక "మన విద్యయొక్క పరమావధి యేమి?" ఈ మౌళిక ప్రశ్నకు స్వామివారిలా సెలవిచ్చినారు:-విద్య పరమావధి శీలము వివేకము పరమావధి స్వేచ్ఛ

నేటి విద్యార్థి తన విద్యార్జనాకాలమును సదుపయోగ పరచుకొనుట లేదు. అసంఖ్యాకములైన దురభ్యాసములకును, అవినీతి ప్రవర్తనలకును లోనగుచున్నాడు. ఇది, ఎంతటి దురదృష్టకరమైన విషయము! దీని పర్యవసానముగా అతడు తన ఉద్యోగాన్వేషణలో తన డిగ్రీని బిక్షాపాత్రగా వాడుకొనును. ఇందుకేనా ఆ లౌకికవిద్య? విద్య అనునది "గర్భము నుండి సమాధివరకు ఒక యాత్ర వంటిద"ని చెప్పబడినది. మానవుడు జన్మించిన దాదిగా మరణించే పర్యంతము ఆధ్యాత్మిక జ్ఞానమును అనుభవించవలసి యున్నది.

నేటి విద్యావిధానము వంచనతో కూడియుండినదియు సంకుచితమార్గములో పొందుటకు పరిమితము చేయబడినది. అందులో లేశమాత్రమునకైననూ నీతిశాస్త్రాధ్యయనము; వేదాంతాధ్యయనము కానరావు. మన పితరులనుండి పారంపర్యముగా సంక్రమించిన నైతిక విలువలు, సంస్కృతులు, నికృష్టము లేక క్షీణగతిని పొందుచున్నవి. ఇట్టి పరిస్థితిలో వానిని పునరుద్ధరించుటెట్లు? పాశ్చాత్యవ్యామోహమను మృగపు గిట్టలచే అణగ ద్రొక్కబడుటకై వానిని మనము వదలివేయ వలెనా? ఈ అవశ్యకరమైన ప్రశ్నలకు జవాబులను పొందగోరువారు ఒక్కసారి శ్రీసత్య సాయి విద్యా బోధనాసంస్థలలోనికి తొంగిచూచిన అవగతమగును. ఇట్టి విద్యాలయములు శీఘ్రగతిని అధికముగా స్థాపింప బడుచున్నవి.

నేను: అడుసు లేక రొంపితో సమానమైన సమాజమునుండి బయటకు ఈడ్వబడి వైటుఫీల్డులోని శ్రీ సత్యసాయి కళాశాలలో విద్యార్జనకు 1978 సం॥లో చేర్పించబడినాను. నా వెనుకటి సమాజమందు ప్రజానీకము అటవికులతో నిండియుండెను. వారు నిరక్షర

కులు. అయినను తామే ఉన్నత సంస్కృతిగలవారని అపోహ పడుచుండిరి.

పవిత్ర బృందావన వాతావరణములో నూతన ప్రపంచమును జూచితిని; వింతలనే సుడిగుండములో చిక్కుకుపోయితిని. ఇచ్చటి పిల్లలు క్రమశిక్షణకు అలవడిన వారు, మృదుభాషులు, మితభాషులు, సచ్ఛీల వంతులు, పరస్పర సహకారమందాసక్తి జూపుటలో ఉత్సాహము గలవారు; ఇట్టి యువవిద్యార్థులను జూచి తబ్బిబ్బైపోయితిని. ఇంతే కాదు; నైతిక ప్రవర్తన, వేదాంతాధ్యయనములను మిన్నగా భావింతురు; లెస్సగా వానిని నేర్చుకొందురు. ఉషఃకాలమందు మేల్కొం దురు, ఏక కంఠముతో ఓంకారము శ్రవణానందముగా జేయుదురు, వారమునకు రెండుసార్లు వేకువఝామున భగవన్నామ సంకీర్తనలు బాడుచూ, పరిసరవాతావర ణమును పునీతము గావించుచూ, నగరసంకీర్తనము గావించు నా విద్యార్థులను జూడ కన్నులపండువుగా నుండును. వారి పాటలు శ్రవణానందదాయకముగా నుండును.

నన్ను బట్టిన మాయ (దయ్యము) నన్నింక మోస గించదు; భ్రమింప జేయదు; దుష్కృత్యములాచ రింప నన్ను బురికొల్పదు. ప్రత్యక్ష భగవంతుని మహిమ అందగ నుండగా, శాశ్వత ప్రేమానుభూతి లభించగా, నాకు వెరపేమి? బృందావనమే నాకు గృహము. ఇది, మాయాపృథ్వినుండి పూర్తిగా వేరై నది, కళంకరహితమైనది.

యువకునియందు ఇంతటి అమూల్యమైన మార్పును దెచ్చునది, బృందావనమునందేమిగలదు? ఈ ప్రశ్నకు అతిసులభమైన జవాబు లభించగలదు. లౌకికవిద్యా వ్యాసంగము మట్టుకే నిజమైన విద్యగానేరదు. అదియే పరమావధియైనచో మానవుని జీవితము తృణమృగా దుల జీవితము కంటె వేరేమి?

లౌకిక సంబంధమైన విషయములకన్న మిన్నయైన విశిష్టత ఏదో ఒకటి కలదు: అదే ఈ ప్రపంచము నందు దుఃఖనివృత్తిని కలుగ జేయునది. ఇది, నేటి లౌకికవిద్యావిధానంలో లోపించింది. కనుక, విద్యావిధానమందు వేదాంతాభ్యాసము లెస్సగా చేర్చ బడవలయును. ఇది సత్యసాయి విద్యావిదానములో కలదు. ఇది ఆదర్శప్రాయమైనది. సత్యసాయి విద్యా విధానము మామూలు విద్యావిధానమును ఆధ్యాత్మిక క్రమశిక్షణతో సమన్వయ పరచుచున్నది.

ఈనాడు మన ప్రాచీన సంస్కృతిని, పాశ్చాత్య సంస్కృతి పూర్తిగానిర్మూలించుచున్నది. ఇట్టి క్లిష్ట సమయంలో సాయి విద్యావిదానమే శరణ్యము. ఇది మన పురాతన సంస్కృతిని పునరుద్ధరించగలదు. సాయి విద్యావిధానమే జగత్తునకు ఆశాజ్యోతిగా ఉపక రింపగలదు.

—ఆంధ్రీకరణం: బి. నరసింహమూర్తి.



# భయప్రదానము

అన్యాయ, అక్రమ, అశాంతులకు లోనైయున్న యావత్ ప్రపంచ మానవాళికి నేటి అస్తవ్యస్త పరిస్థితులయందు ఒక తద్భుత శక్తి అభయ వరప్రదానమెంతో అత్యవసరమైయున్నది. కాని అట్టి అద్భుతశక్తి, అట్టి అభయ వరప్రదాత నేటికాలమున శ్రీసత్యసాయి బాబాయే.

ఏమన:—ద్వాపరయుగమున శ్రీ కృష్ణ పరమాత్మ శ్రీ గీతాపరముగా

శ్లో॥ అనన్యశ్చింతయంతో మాం, యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం, వహామ్యహం ॥ అనిసెలవిచ్చిరి.

కలియుగమున, మనసమకాలీనులగు శ్రీ సత్యసాయి కృష్ణ పరమాత్మ, తమవచనామృతపరముగా,

శ్రీపుట్టపర్తినిలయుడు,
కాపాడును నిన్ను నెపుడు, కరుణా కరుడై
చేపట్టి నిన్ను బ్రోచును,
ఏ పట్టున విడువకుండ ఏలును నిన్నున్ ॥
అని వాకృచ్చిరి.

భావమేమనగా: ఎవరు శ్రీ సత్యసాయిని, తమ సర్వస్వముగా నెంచి, త్రికరణ శుద్ధిగా కొలిచెదరో, ఎవరు వారలకు సంభవించు లాభ నష్టములు, సుఖ దుఃఖములు, శ్రీ స్వామి అనుగ్రహప్రసాదములని శిరసావహింతురో, వారిని, కంటికిరెప్పవలె సదా శ్రీ సత్యసాయి భగవానుడు కాపాడుననుటలో ఎట్టి సందేహము లేదు. పైన చెప్పిన రీతిగా వర్తించు భక్తవర్యులకు ప్రసాదించిన వరప్రదానము ఈ విధముగా విశదీకరించిరి.

అడవిలోన నున్న, ఆకాశమున నున్న,
పట్టణమున నున్న, పల్లెనున్న,
గుట్టమీదనున్న, నట్టేటనీవున్న,
మరువడు నిను సాయి మదిలోనెపుడు.

అనగా శ్రీ సాయిహృదయములో, సాయిని కొలుచు భక్తులకు స్థానమున్నదని స్పష్టపడుచున్నదిగదా. అట్టి భాగ్యమునకు మించిన భాగ్యము ఈ జగత్తులో వేరొకటి లేదు. ఈ ప్రపంచములో మానవులు తమ కృషి సామర్థ్యముల వలన సంపాదించు భోగభాగ్యములు, కీర్తిప్రతిష్టలు శాశ్వతమైనవికావు. ఒక్క భగవదనుగ్రహ భాగ్యమే శాశ్వతమైనది. అది మానవుని జీవితపర్యంతము ఆత్మశాంతి నొసంగుటయే కాక, మరణానంతము అతడు ఏలోకమునకేగిన, అతనిని అనుసరించును. కనుకనే శ్రీ సాయినాధుడు తమ ఉపన్యాసములలో తరచుగా భగవంతుని ప్రేమస్వరూపుడనియూ, భావప్రియుడనియు, అట్టి భగవదనుగ్రహమును సంపాదించుటకు మానవుడు దైవపితృత్వమును, సాటిమానవులతో సోదరత్వభావమును క్రియాత్మకముగా అలవరచుకొనమని బోధించుచున్నారు. ప్రపంచములో ఎన్నో రకముల మత ప్రచారకులు, మతగురువులు ఉన్నారు. కాని వారుచేయు బోధలు, వారి, వారి, మతసంస్థల అభివృద్ధికార్యక్రమ నిర్వహణకు వలయు నిధిసేకరణకు

ఉపయోగపడును. కాని, శ్రీసాయినాధుని బోధలు ప్రతి ఒక్కని ఆత్మవిచారణకు, ఆధ్యాత్మికోన్నతికి ఎంతో ఉపకరించుచున్నవి. ఏమన స్వామికి ఎట్టిప్రత్యేక సంస్థలేదు. దానిని వృద్ధిచేయుటకు ఇతర ధనసహాయ మవసరము అంతకంటెలేదు. స్వామిచేయి ఎప్పుడూ పైనఉండునుకాని, యాచన నిమిత్తము క్రిందనుండదు. అయితే అట్టి సాయి భగవంతుడా, రామ, క్రిష్ణ అవతార సముడా అనిచాలమంది సందేహించుట సర్వవిదితము. నిస్సందేహముగా శ్రీసాయి అవతారపురుషుడని, ఆనాటి శ్రీ కృష్ణుడే (వైకుంఠవాసియే) ఈ నాటి శ్రీ సత్య సాయి అని శ్రీస్వామి తన ఉపన్యాసముద్వారా ఒకపరి ఈ క్రిందివిధముగా విశదీకరించిరి.

ఏ గుణంబులు కల్గి ఏతెంచినాడో, ప్రహ్లాదుపాలింప
పరమపురుషుండు,
ఏ గుణంబులు కల్గి ఏతెంచినాడో, కరినిగాచిన కమల
నాధుండు.
ఏ గుణంబులు కల్గి ఏతెంచినాడో, పేద కుచేలుని
బ్రోవ గోపాలుండు,
ఏ గుణంబులు కల్గి ఏతెంచినాడో, ధృవకుమారుని
సాక వైకుంఠవాసి,
ఆ వైకుంఠవాసియే, ఈ సత్యసాయి
సచ్చిదానంద మూర్తి, పుట్టపర్తి షట్చక్రవర్తి.

మరియు అవతారపురుషుని లక్షణములు ఈ విధముగా శాస్త్రములు విశదీకరించినవి.

శ్లో॥
ఉత్పత్తించ,వినాశంచ, భూతానాం ఆగతిం, గతిం,
వేత్తివిద్యాం, అవిద్యాంచ, సవాచ్యః, భగవాన్, ఇతిః॥

పైన వివరించిన లక్షణములు శ్రీ సత్య సాయీశ్వరునిలో మూర్తీభవించుటవలన, సాయి సాక్షాత్తు అవతార పురుషుడనుటలో సందేహము లేదు. మరియు శ్రీసత్య సాయి తమ ఉపన్యాసముద్వారా, తాను ప్రకృతికి బానిసను కాదనియు, ప్రకృతి తన ఆధీనములో నున్నదని, పంచభూతములు, అష్టసిద్ధులు తనహస్తద్వయములో ఇమిడి, తనయిచ్ఛానుసారము వర్తించుచున్నవని ప్రకటించిరి. మరియు ప్రపంచమందలి మానవకోటి పుట్టుక కర్మజన్యమనియు, తనపుట్టుక సంకల్పజన్యమనియు, ప్రకటించిరి.

కావున లేనిపోని సందేహములకు, వ్యర్థ తర్కవితర్కములకు మానవుడు పాల్పడక, కాలస్వరూపుడగు భగవంతుని, అవతార ఆగమనమును సందేహింపక, త్రికరణశుద్ధిగా శ్రీ సాయి 'పరమాత్మ' తత్వమును విశ్వసించి, బోధలను ఆచరించి, శ్రీసత్యసాయీశ్వరుల అనుగ్రహపాత్రులగుటకు శక్తిని ప్రసాదింపవలసిన సమయము యావత్ మానవకోటికి లభించినది. ఈ సదవకాశమును చేజార్చుకొనక, పూర్తిగా ఉపయోగించుకొనిన మరల జన్మనెత్తవలసిన అవసరమురాదు. పశు, పక్షి, క్రిమి, కీటకాది జన్మలలో సాధించలేనిది, ఈ ఒక్క మానవజన్మయందే సాధించి, మానవత్వమునుండి మాధవత్వమునకు, జీవత్వమునుండి శివత్వమునకు, నరత్వమునుండి నారాయణత్వమునకు చేరవచ్చును.

"పిండినిపట్టి రొట్టె, తిండిని పట్టి త్రేపు, సాధనను పట్టి సాక్షాత్కారమని" స్వామి శెలవిచ్చినట్లు ప్రతి ఒక్కరు, తమస్వల్పజీవన వ్యవధిలో భగవంతుని విశ్వసించి, స్మరించి, సాధనచేసి, ఆ విశ్వరూపునిలో ఐక్యము చెందుటకు కృషిచేయవలెను. కాని సాయిని సందేహించుట, దూషించుట మానవ పతనమునకు దారి

తీయుచే. ఏమన సాయి దూషణ, భూషణలకు అతీతులని ఈ విధముగా విశదీకరించిరి.

'యస్' అనువానికి 'యస్' అనురా,
'నో' అనువానికి 'నో' అనురా,
'నో' 'యస్' లు నీ నోటికిరా,
సాయికి సర్వం 'యస్' 'యస్' "యస్" ॥

పి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీకాకుళం.

# సాయి కుటుంబం

సాయి కుటుంబం వసుధైక కుటుంబం.

జాతి మత విభేదాలు లేకుండా ఖండఖండాంతరాల్లోని మానవులంతా ఈ నాడు సాయి కుటుంబంలోని సభ్యులు. వీరంతా సత్య, ధర్మ, శాంతి, ప్రేమలనే నాలుగు విశ్వజనీనమైన సూత్రాలను తమ జీవిత సాధనగా స్వీకరించారు.

భగవాన్ సత్య సాయీశ్వరుని ప్రేమ వీక్షణాల్లో ప్రపంచ మతాలన్నీ ఒకే ఒకమతంగా కలసిపోతాయి. అదే సాయిమతం. ప్రతి మానవుడు తనలోని దివ్యత్వాన్ని గుర్తించటమే సాయిమతంలోని మూల సూత్రం. ఇందుకు భక్తి, జ్ఞానం, కర్మ, యోగం సోపానాలు. ఇవన్నీ సాధనలోని వేర్వేరు అంశాలు. సేవాదృష్టితో చేసే కర్మ, ప్రేమపూరిత హృదయంతో ఆత్మ సమర్పణ చేసుకోవటంలో భక్తి, వివేక విచారణలతో పరిపక్వత చెందే జ్ఞానం. నేనూ పరమాత్మ అయిన సాయి ఒక్కటే అనే అనుభవం, ఇవన్నీ సాయి మత సౌధానికి గల సోపానాలు.

హిందువులకు త్రిమూర్త్యాత్మక స్వరూపుడుగా, రామ కృష్ణాది దివ్యావతార స్వరూపుడుగా, మహాకాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతీ స్వరూపిగా శ్రీ సత్యసాయి దర్శనం యిస్తున్నారు. అలాగే క్రైస్తవులకు స్వామిలో క్రీస్తు, ముస్లింలకు స్వామిలో అల్లా, పార్శీవారికి అహూర్ మజ్దా .... ఇలా ప్రతి ఒక్కరికీ వారివారి హృదయాది దైవంగా స్వామి సాక్షాత్కరిస్తారు. అందుచేతనే ఈ అనుభవానికి చిహ్నంగా భూలోక వైకుంఠం అయిన పుట్టపర్తిలోని పూర్ణచంద్ర సభాభవనంలో వేదికకు ఇరువైపులా బుద్ధ, జీసస్, జరాతుష్ట్రి, కృష్ణుడు వంటి దివ్యమూర్తుల రమణీయ రూపచిత్రాలు, వారి సూక్తులు సందేశాలు మనకు కనిపించుతాయి. నిరాకారుడైనా అల్లా దివ్యవాణి అయిన ఖురాన్ గ్రంథము యొక్క వాక్యాలు కనిపించుతాయి.

క్రైస్తవులకు శిలువ పవిత్ర సంకేతం. శిలువలోని నిలువు గీత అహంకారానికి గుర్తు. అడ్డగీత అహంకార నిర్మూలనాన్ని సూచిస్తుంది. అహంకార నిర్మూలనం జరిగినప్పుడే మానవునిలో అంతరాత్మ మేలుకొంటుంది. మానవహృదయంలో దివ్యసామ్రాజ్యం మేలుకుంటుంది. ప్రపంచములో శాంతి అవతరిస్తుంది" అంటూ స్వామి శిలువలో గల రహస్య సంకేతాన్ని వివరిస్తారు. క్రైస్తవ భక్తులకు స్వామి సాక్షాత్తు క్రీస్తు ప్రభువుగా కనిపించుతారు.

"జీసస్, క్రైస్తవులకే చెందుతాడనీ, క్రిస్తమస్ వంటిపండుగలు క్రైస్తవులే చేసుకోవాలనీ అనుకోవటం తప్పు. ఎదో ఒక మతాన్ని అంగీకరించినంత మాత్రాన ఇతర ధర్మాలు మనకు చెందినవి కావు అనుకోవటం భ్రాంతి. రాముడు, కృష్ణుడు, క్రీస్తు మొదలైన మహాపురుషులు ప్రపంచములోని మానవులందరికీ చెందినవారే. ఇలాటి దివ్యపురుషులు మానవజాతి మొర విని అవతరిస్తూవుంటారు". అన్నారు స్వామి.

పాశ్చాత్య, ప్రాచ్య ప్రపంచంలోని భక్తులు స్వామి దివ్యావతార తత్వాన్ని గూర్చి పొందే అనుభవాలను వివిధ గ్రంథాలుగా రూపొందిస్తున్నారు. ఈ లోకాతీతమైన అనుభవాలను పొందే ఈ భక్తులందరిదీ ఒకే కుటుంబం; అదే సాయి కుటుంబం.

ఇందిరాదేవి అనే భక్తురాలు సాయి యోగాన్ని వివరించారు. ఆమె స్వామి దివ్యతత్వాన్ని అమెరికావంటి పశ్చిమ ఖండాల్లో వివరిస్తున్నారు. శామ్యూల్, హెచ్. శాండ్విన్ అనే ప్రఖ్యాత "సైకియాట్రిస్టు" స్వామితో గల తన అనుభవాలను పరిశీలనలను Sai Baba, Holy Man and the Psychiatrist అనే గ్రంథంగా వ్రాశారు. వీరు అమెరికా దేశస్థులే, జ్యూ మతస్థులు.

హవార్డ్ మర్ఫెట్ అనే ప్రఖ్యాత దివ్యజీవన సాధకుడు, రచయిత, "Sai Baba The Man of Miracles", "Sai Avatar" అనే రెండు రచనలు చేశారు. ఈ రచనలు సమగ్రమైన పరిశీలన అనంతరం వ్రాసినవి. ఇవి ప్రపంచం అంతటా ఎంతో ప్రచారం పొందుతున్నరచనలు. ఐస్‌ల్యాండ్ వంటి సుదూర దేశాల్లోకూడా ఐస్‌లాండ్ వారిభాషలో స్వామి జీవన సందేశాలు గ్రంథరూపంలో వెలువడుతునాయి.

హిస్లాప్ వంటి భక్తులు స్వామితో జరిపిన సంభాషణలను గ్రంథస్థం చేశారు। ఈ రచనల్లో అనేక సూక్ష్మమైన తాత్విక అంశాలు స్వామి అనుగ్రహించిన వివరణలతో మన సందేహాలను తీరుస్తాయి.

ఛార్లెస్ పెన్ వంటి వారు ప్రపంచములో ఏమూల వున్నా, స్వామి, వారికిగల సందేహాలను మానసిక, బౌద్ధిక స్థాయిలో తీరుస్తున్నారు.

డాక్టరు బరానోస్కీ వంటి శాస్త్రవేత్తలకు స్వామి సైన్సు పరిశోధనలకు అతీతమైన తన దివ్యతత్వాన్ని తెలియజేస్తున్నారు.

ఇవన్నీ కేవలం కొన్ని ఉధాహరణములు మాత్రమే! ఈనాడు అమెరికాలో, ఇగ్లాండులో, యూరప్ దేశాల్లో, ఆఫ్రికా, జపాన్, ఆస్ట్రేలియా, ఈస్ట్ ఇండీస్ వెస్ట్ ఇండీస్‌లలో భగవాన్ దివ్యప్రబోధం వినిపించుతూ వుంది. అక్కడ సాయికుటుంబం విస్తరిస్తున్నది.

జొరాష్ట్రియన్ మతంకూడా ప్రాచీన మతాల్లో ఒకటి. అహూర్ మజ్దా పేరుతో వారు పరమాత్మను ఉపాసిస్తారు. అగ్ని వారికి పవిత్ర సంకేతం. డాక్టర్ యూరిచ్, బి. ఫనిబుండా అనే ప్రముఖ వైద్యుడు జోరాష్ట్రియన్ మతస్థుడు. వీరికి 1971లో స్వామితో పరిచయం కలిగింది. ఆనాడు వీరికి వైద్య విజ్ఞానం తప్ప ఆధ్యాత్మిక విజ్ఞానంలో ప్రవేశం లేదు. అలాటి ఈ డాక్టర్‌ను స్వామి అనుగ్రహించారు. సమస్త మత ధర్మాలలో గల సారాన్ని బోధించారు. అదే సాయితత్వం. ఈ డాక్టర్ గారికి సాయితత్వానుభవం కలిగింది. ఫలితంగా 1976లో "The Vision of the Divine" అనే మహత్తర రచనను స్వామి ఆశీస్సులతో ప్రకటించారు ఈ పుస్తకానికి పెట్టిన పేరుకూడా స్వామి అనుగ్రహించినదే।

"అక్కడా, ఇక్కడా వెతుకుతూ, దేవాలయాల్లో చర్చిలలో అన్వేషిస్తూ, భూలోకంలోనూ, స్వర్గంలోనూ కూడా నీ అన్వేషణ సాగిస్తూ చివరకు నీవు బయలు దేరిన చోటికే చేరుకుంటావు. ఎవరికోసం యింతకాలం వెతుకుతున్నావో, ఎవరికోసం ఆలయాల్లో, చర్చిలలో ప్రార్థిస్తున్నావో, విలపించుతున్నావో, అలాంటి రహస్యాతి రహస్యమైన నిజతత్త్వం నీలోనేవుంది, దాన్నే ఆవిష్కరించు. అదే నీకు బంధువు, సేతువు. అంటూ స్వామిపై పుస్తకంద్వారా తమ దివ్యసందేశం సాయి కుటుంబానికి వివరించారు.

గత రంజాన్ పండుగ నాడు స్వామి పుట్టపర్తిలో మసీదును తమ మహమ్మదీయ భక్తులకోసం ఆవిష్కరించారు. షిర్డీ అవతారంలో "ద్వారకామాయిగా" పేరు సార్థకమైనది.

పాతూరిప్రసన్నం.

# మానవునకు స్వేచ్ఛా సంకల్పము కలదా?

పరిష్కృతిలో తృప్తిపడువారు స్వేచ్ఛాసంకల్పమును తమ పనులలో విస్మరిస్తారు. ప్రవర్తించుటకు పూర్వమే తమ స్వేచ్ఛాసంకల్పమును విస్మరించి, కార్యాచరణపుతీరును నిశ్చయించుకొందురు. నీవు ఒక ప్రత్యేక విధముగా ప్రవర్తించుటకు నిశ్చయించుకొంచే మరియొకలాగున నడచుకొనలేవు: అనగా నీవు కోరికలచే బంధింపబడినావు. కోరికలు, స్వేచ్ఛారహితముగగాక; ఆలోచనాపూర్వకముగ నిర్ణయించబడినవి. ఆలోచనాపూర్వకమైన చర్యలన్నిటికినీ ముందుగనే నిర్ణయించబడిన పర్యవసానములుండును. నీ యభిప్రాయము వాస్తవముగా మితములో నుంచబడును. క్రియాప్రతిక్రియల భ్రమణములు ఉత్పన్నమగును. కనుక; "నాకు స్వేచ్ఛాసంకల్పము గలదా? నాకు స్వేచ్ఛాసంకల్పము లేదా" ఇది చిక్కైన సమస్య. ఇది యోగ్యతను బట్టి నిర్ణయించుటకు సాధ్యపడదు.

ఇప్పుడు దీనిని విశ్లేషించుటకు ప్రయత్నించెదము.

"స్వేచ్ఛాసంకల్పము"

1. స్వేచ్ఛయొక్క సంకల్పము
2. స్వేచ్ఛగల సంకల్పము
3. స్వేచ్ఛసంకల్పించుటకు సామర్థ్యము
4. స్వేచ్ఛగానుండుటకు సంకల్పము

మొగటిదగు "స్వేచ్ఛాసంకల్పము": సంకల్పమే మూలము. సంకల్పము దేనినుండి బయల్వెడలునో అది క్రియా ప్రతిక్రియలయక్కరలచే బంధింపబడకూడదు, బాధ్యతలు ఉపకారములకు బద్ధమై యుండ కూడదు; పరాధీనతచే పరిమితముగాకూడదు. చర్యకు ఇందులో అగత్యతలేదు; కనుక ముందుషరతంటూ ఉండదు; మించిపోదు. ఇప్పుడు సముచితప్రయోజనముగల ఫలితమునకు వచ్చెదము-స్వేచ్ఛోత్పత్తి స్థానములో స్వేచ్ఛా సంకల్పము లేదనుకొనబడును. ఎవరైతే స్వేచ్ఛా సంకల్పమును పొందగోరునో, ఉపయోగపెట్టుకొనే సామర్థ్యము కలిగియుండునో లేదా కాదనునో అతడు స్వేచ్ఛా సంకల్పమును పొందియుండును. మనుష్యునకు స్వేచ్ఛా

సంకల్పార్హత లేదనడము సందేహాస్పదముకాదు. కను కనే శ్రీకృష్ణభగవానుడిట్లు తేటతెల్లము చేసెను. తాను అనవసరముగా ప్రవర్తించుటలేదు తనపైగల బాధ్యత కారణముగా క్రియాసక్తుడగుచున్నాడు. అయితే మనుష్యుడు అవసరముగా క్రియాసన్నద్ధుడు కావాలని ప్రవర్తిస్తే, తనకు స్వేచ్ఛరాగలదా? తప్పనిసరిగా అభ్యసించాలని అనుకొన్నవాడు తప్పకప్రవర్తించాలి; ప్రవర్తించే వారు తప్పక అభ్యసించాలి. భగవంతునకు నేర్చుకోవలసిన దేదియును లేదు, కనుక, ప్రవర్తనావశ్యకతను గుర్తించవలసిన నిర్బంధములేదు. భగవంతుని చేతల (పనుల)న్నియును తన సంకల్పఫలితములే; అవసరమైనవని గుర్తింపబడినవి. వీనిని భగవంతుడు అవశ్యకతారాహిత్యమును జూపుటకు స్వేచ్ఛగా గాలిలోనికి విసరును. అందుకే బాబాగారిలా అంటారు "సంకల్పము నాకు అల్పమైనది, నా అనుగ్రహము ప్రేమ, నమ్మకముగల భక్తులకు ఎల్లప్పుడూ లభ్యమే". బాబాగారెంతటి ఔదార్యవంతులు; సంకల్పము వారికి బాహ్యమైనదిగాదు. ఇది వారితోనే గుర్తించబడును. ఇతరుల చేతలు (పనులు) వారికి భౌతముగా అవగతముగాకయే; సంకల్పము స్వయం సమ్మతాఫలితమౌతుంది.

రెండవదగు సహజలక్షణము "స్వేచ్ఛగలసంకల్పము.":—ఇది సర్వశక్తిత్వమును ఆరోపిస్తుంది. ఒక శక్తి, ప్రతివస్తువును సృష్టించి, నాశనము గావించగలిగిననేగాని స్వేచ్ఛాసంకల్పముగా పరిగణింపబడదు. మానవుడు సంకల్పించి గరికనైననూ కదల్పలేడు. ఇంక తానెట్లు తనస్వేచ్ఛాసంకల్పమును గురించి బడాయి కొట్టగలడు? ఈపరిస్థితిలో చేతలు తమంతట తామే స్వేచ్ఛాసంకల్పమును వెంబడిస్తాయి. సంకల్పము స్వేచ్ఛను తృప్తిపరచు నిమిత్తమై చర్యలచే బంధింపబడదు; ఆధారపడదు. కేవలము సంకల్పము స్వేచ్ఛకుగాను చర్యాపరంపరలను అనతికాలములో తప్పక సృష్టించవలెను. సర్వకాల సర్వావస్థలయందు సంకల్పము స్వేచ్ఛకురూపమిచ్చును. కనుక ఇది దేశకాలములకు అతీతమైనది. లేశమాత్రమైన యే సంకల్పమును మనుష్యుడు పొందునో అది తనదిగాదు; తన మానసిక వైఖరులచే ప్రవర్తితమైనది. ఒక ప్రత్యేక సందర్భమందు ఏ ఇరువురు వ్యక్తులు ఒకేలాగున ప్రవర్తించరు, ఎందుకనగా వారి జీవితకాలమందు తమకు ఒకేరకమైన ఉన్ముఖత సంక్రమించియుండదు, ఎవడును కాలావధులను దాటలేడు. దివిని భువిగానూ, భువిని దివిగానూ క్షణకాలంలో మార్చగలనని బాబా వారివలె ఎవరునూ వక్కాణించలేరు; ఎందుకనగా ఏ ఒక్కరి సంకల్పము స్వేచ్ఛగా వచ్చునదిగాదు.

మూడవసహజలక్షణము:—స్వేచ్ఛగా సంకల్పించుటకు సామర్థ్యము: స్వేచ్ఛగా సంకల్పించుశక్తిని ముందుగా ఊహించును. ఇదికూడ సర్వశక్తిత్వము నుండే రావలెను. ఎవరికైతే పూర్వాపరశాస్త్రపరిజ్ఞానము గలదో, వారు స్వేచ్ఛగా సంకల్పించగలరు. ఎందుకనగా అతనికి సంకల్పము సర్వశక్తిలోని భాగమే. పర్యవసానమువల్ల కలత చెందడు; తానే హేతువు తానే పర్యవసానము. అతనిలో కాలము లీనమైయున్నది; అతడు శాశ్వతుడు. అందువలననే, స్వేచ్ఛాసంకల్పము అతని సర్వశక్తికిచిహ్నము. ఇది చేయవచ్చును, ఇది చేయకూడదు అని అతనికి సూచించువారు ఎవ్వరునూ లేరు. తన జగత్సంబంధమైన పథకమునకు అనుగుణ్యముగా వారి వారి కర్తవ్యములను నిర్ణయించెడివాడతడు. బాబా పదే పదే వక్కాణించారు, "నా కొరకు తయారు చేసుకొన్న ప్రత్యేకపథకము నాకుంది. ఈ విశ్వమందలి ఏ శక్తియూ దీనిని

ప్రేరేపింపజాలదు; మార్చలేదు; నిలుపలేదు.'' తన సంకల్పమునుండి ఇసుమంతైననూ మార్చడు. తన సంకల్పమునెరవేరవలసినదే; తనకు స్వేచ్ఛాసంకల్ప మున్నందున ఒక్కాణిస్తాడు. కృష్ణబాబాలు తప్ప మరెవరైననూ సంకల్పములను నెరవేర్చ గల్గిరే? బాబా అంతఘనంగా శ్రీకృష్ణుడు కూడా తనసర్వశక్తిత్వాన్ని నిరూపించలేదు.

తదుపరి స్వేచ్ఛాసంకల్పముయొక్క నాలుగువపరిమాణమునకు వత్తము. ఇది స్వేచ్ఛగానుండుటకు సంకల్పము. దీనిని మానవుడు ధారాళముగా (నిరాటంకముగా) పొందియున్నాడు. ఎల్లబంధనములనుండి విముక్తిని పడయుటకు సంకల్పసిద్ధిని పొందియున్నాడు; ఈ సరణిలో కార్యనిర్వహణా దీక్షను బొందియున్నాడు. సంకల్పమును సర్వశక్తిత్వంగా జేయుటకు తన మన స్పాక్షితో పూర్వాపరశాస్త్రములను మిళితము జేయు శక్తిని పొందినాడు. ఆ సర్వవ్యాపితమైన, సర్వశక్తమైన స్వేచ్ఛా సంకల్పము అతనిలో గూడనూ ఉండుటచేత, ఆ భగవంతుడు స్వాభావికముగ దానితో నొకటగుటకు సంకల్పించును. దాశ్యోన్ముఖతల నుండియు, అవశ్యకతలనుండియు, కారణములనుండియు, పర్యవసానములనుండియు విముక్తత నొందును; స్వేచ్ఛా సంకల్పమును గ్రహించుటతో యాత్ర ముగియును. మనుష్యుడు ప్రేరేపింపబడునంతవరకు తన స్వాతంత్ర్యమును వృద్ధి నొందించుకొన లేదు. ఉన్నతశక్తియుతమైన సంకల్పమును గుర్తించిననేగాని స్వేచ్ఛా సంకల్పము సిద్ధించదు. ఉన్ముఖతల బంధనమునుండి స్వేచ్ఛను వేరు చేసిననేగాని స్వేచ్ఛాసంకల్పము లభ్యముగాదు.

(సశేషము)

అనువాదకుడు:—బి. నరసింహమూర్తి

బిజయ్. కె. మిస్రా—కటక్.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9 | మణిమాల | 2-00 | 0-20 |
| 10. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 13. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 14. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 15. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 17. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 19. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 21. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు—67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగళకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్డ్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 192వ పుటలో చూడండి)

Regd. No. KRNU—83 AUGUST 1980

ఈ నాటి యువకులు విదానంగా విచారణ చేయదములేదు. వచ్చిన భావములు విచ్చలవిడిగా సంచరింపజేస్తున్నారు. కామధేనువునైనా త్రాటితో కట్టవచ్చును కాని, దుష్ట భావములను అరికట్టలేము. మనసులో దుష్టభావములు ప్రవేశిస్తే భగవంతుని చింతించి, ఇంద్రియములను నిగ్రహించుటం భారతీయుల ధర్మం.. ఈ నాడు మానవుడు సత్క్రమ మార్గాన్ని అవలంబించక పోవటంచేత మనదేశం బలహీనమై పోయింది. ఒక చిన్న గడ్డిపోచ చీమను కూడ బంధించలేదు. మనం అన్యోన్యతతో ఏకత్వంగా ఎట్టి కార్యమునైనా సాధించవచ్చు. మన భారతీయులంతా ఏకంగా ఉండి దేశపవిత్రతను సంరక్షించాలి. ఈ నాడు అది చాలా అవసరం. భారతదేశం అనాది కాలము నుండి ఇతర దేశాలకు సద్భావమునందించింది. భారతీయులని పేరు పెట్టుకున్నవారంతా ఆ పేరు సార్థకం చేసుకోవాలి. భారతమాత పుత్రులమని చాటటానికి మీరు పూనుకోవాలి.

Regd. with Registrar of Newspapers No. RN/10772/64